# చిలకమర్తీయం



కళాప్రపూర్ణ

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం

జననం 26-09-1867 నిర్యాణం 17-06-1946

చిలకమర్తి ఫౌండేషన్

12-15-3/2/1, సుభాష్‌నగర్,

కోరుకొండ రోడ్, రాజమహేంద్రి - 533 105.

చిలకమర్తీయం
26-09-2010
మొదటి ముద్రణ
1000 కాపీలు


ప్రతులకు :
పెరుమాళ్ళ రఘునాథ్,
కార్యదర్శి
చిలకమర్తి ఫౌండేషన్,
23-15-3/2/1,
సుభాష్‌నగర్, కోరుకొండ రోడ్,
రాజమహేంద్రి - 533 105.
ఆంధ్రప్రదేశ్

మూల్యం : రూ. 30/-

కవర్ డిజైన్ : డా॥ అరిపిరాల

అక్షరాల కూర్పు :
అగ్ని గ్రాఫిక్స్ - రాజమహేంద్రి.
ఫోన్ : 6579478

ముద్రణ :
మహేశ్వరి ప్రింటర్స్ & బైండింగ్ వర్క్స్, రాజమహేంద్రి.
సెల్ : 9440041577

# చిలకమర్తి ఫౌండేషన్

## కార్యవర్గం

### గౌరవ సలహాదారులు

డా॥ ఎం. బాబురావు
మాజీ పార్లమెంటు సభ్యులు
ప్రొఫెసర్ శ్రీమతి పి. రామలక్ష్మి
నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.
ప్రొఫెసర్ శ్రీమతి పి. మాణిక్యాంబ,
విశ్రాంతాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్.

| | | |
|---|---|---|
| **గౌరవ అధ్యక్షులు** | : | శ్రీ యాతగిరి శ్రీరామ నరసింహారావు |
| **అధ్యక్షులు** | : | డా॥ చల్లా హైమవతి |
| **ఉపాధ్యక్షులు** | : | శ్రీ వి.ఎస్.ఎస్. కృష్ణకుమార్ |
| | : | శ్రీ వి. శేషగిరి వరప్రసాద్ |
| **కార్యదర్శి** | : | శ్రీ పెరుమాళ్ళ రఘునాథ్ |
| **కోశాధికారి** | : | కుమారి కొప్పర్తి యశోదకుమారి |
| **సభ్యులు** | : | డా॥ అరిపిరాల నారాయణరావు |
| | : | శ్రీ కె. ఫణి నాగేశ్వరరావు |
| | : | శ్రీ కరణం నూకరాజు |
| | : | శ్రీ ఎన్. జోగేశ్వరరావు |
| | : | డా॥ డి.ఎస్.వి. సుబ్రహ్మణ్యం |
| | : | శ్రీ ఎన్. రవిప్రకాష్ |
| | : | కుమారి. కె. దుర్గాదేవి |

# ఈ పుస్తక ప్రచురణకు నేపథ్యం

స్వచ్ఛమైన చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి జీవిత చరిత్ర మీద బురద జల్లడానికి కొందరు ప్రయత్నాలు సాగించారు. ఒకటి రెండు విషయాలు మార్చగలరు, పాఠకులను ఏమార్చగలరు. కానీ సాహితీ ప్రియుల హృదయాలలో సుస్థిర స్థానాన్ని సంపాదించిన వారిని మాత్రం మార్చలేరనేది సత్యం. ప్రజల నాలుకలపై నర్తించే చిలకమర్తి వారి "భరతఖండంబు చక్కని పాడియావు...." పద్యాన్ని మాత్రం ఎన్నటికి తుడిచి వేయలేరు.

ఆంధ్రజ్యోతి దినపత్రిక 'వివిధ' సాహిత్య వేదికలో ది. 19-01-2009న అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖలో ఆచార్యులుగా నున్న డా॥ ఎస్వీ. సత్యనారాయణ గారు "అది చిలకమర్తి రచన కాదు" అంటు "భరతఖండంబు చక్కని పాడియావు..." పద్యంపై వివాదానికి తెరతీశారు. దానికి ప్రతిస్పందనగా డా॥ ముక్తేవి భారతి ది. 02-02-2009 "ఆంధ్రజ్యోతి"లోను, ది. 19-02-2009లో నా స్పందన ప్రకటించబడ్డాయి. తర్వాత మరల ది. 06-04-2009 తేదీ ఆంధ్రజ్యోతిలో శ్రీ కరణం సుబ్బారావు మరల ఇదే అంశం ప్రకటించారు. తదుపరి శ్రీ సన్నిధానం నరసింహశర్మ "బ్రౌన్ మందిరం" నిర్వహణలో ది. 09-05-2009 తేదీ సాయంత్రం రాజమండ్రి శ్రీ సర్వారాయ కళామందిరంలో "భరతఖండంబు చక్కని పాడియావు... ఈ పద్యాన్ని వ్రాసిందెవరు?" అనే శ్రీ కరణం సుబ్బారావు గారి పుస్తకావిష్కరణ సభ జరిగింది. నాటి సభకు ఆచార్య జయధీర్ తిరుమలరావు గారు అధ్యక్షులు. ఆచార్య కోలవెన్ను మలయవాసిని, శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారి మనుమలు, ప్రభృతులు పాల్గొన్నారు. నాటిసభలో తమ వాదన వినిపించడానికి అవకాశమివ్వమని ప్రజాపత్రిక గౌరవ సంపాదకులు శ్రీ సుదర్శన్, శ్రీ సి.బి.వి.ఆర్.కె. శర్మ (దివాన్ చెర్వు శర్మ) శ్రీ మహీధర రామశాస్త్రి ప్రభృతులు కోరగా నిరాకరించారు. అపుడు అదే సభలో శ్రీ సుదర్శన్ త్వరలో ఆ పుస్తకం నిగ్గు తేలుస్తామని, ఈ పుస్తకంలోని అంశాలతో ఏకీభవిస్తూ అభిప్రాయాలు తెలిపిన వారందరూ ఆ సభకు రావాలని ఆహ్వానించారు.

ప్రజాపత్రిక గౌరవ సంపాదకులు శ్రీ సుదర్శన్ ప్రకటించిన విధంగా "ఈ పద్యాన్ని వ్రాసిందెవరు?" నిగ్గు తేల్చే సభ ది. 07-06-2009 ఉదయం రాజమండ్రి ధర్మంచర కమ్యూనిటీహాల్‌లో జరిగింది. సదరు పుస్తకంపై ఆమోదం వెలిబుచ్చిన తొమ్మిది మంది ప్రముఖులను, రచయిత శ్రీ కరణం సుబ్బారావును శ్రీ సుదర్శన్ ఆహ్వానించడం జరిగింది. కానీ రచయిత, శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి తప్ప మిగిలిన వారెవరూ హాజరు కాలేదు. కళాగౌతమి వ్యవస్థాపకులు డా॥ బి.వి.ఎస్.మూర్తి, శ్రీ సి.బి.వి.ఆర్.కె. శర్మ (దివాన్ చెర్వు శర్మ) "జ్యోతిషవిజ్ఞాన భాస్కర" రాష్ట్రపతి సమ్మానిత శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి, డా॥ ఎమ్.ఆర్.వి. శర్మ, శ్రీ మహీధర రామశాస్త్రి, శ్రీ సన్నిధానం నరసింహశర్మ, డా॥ గూటం స్వామి, నేను పాల్గొన్నాము. దివాన్‌చెర్వు శర్మగా ప్రసిద్ధులైన సి.బి.వి.ఆర్.కె. శర్మ 18 పేజీల వ్యాసం చదవి వినిపించి, సభలో పంచిపెట్టారు. వక్తలు అడిగిన ఏ ప్రశ్నకీ శ్రీ కరణం సుబ్బారావు సంతృప్తికరమైన జవాబు చెప్పలేకపోయారు.

తదనంతరం శ్రీ దివాన్ చెర్వు శర్మ, శ్రీ మహీధర రామశాస్త్రి, శ్రీ సుదర్శన్‌ల వ్యాసాలను గ్రంథ రచయితకు, ఏకీభవించిన 9 మంది విద్యావేత్తలకు "చిలకమర్తి ఫౌండేషన్" పక్షాన కొరియర్‌లో పంపడం జరిగింది. వారి అభిప్రాయాలను 2009 జూలై నెలాఖరులోగా తెలుపమని, మేము ప్రకటించబోయే పుస్తకంలో ప్రచురిస్తామని కోరడం జరిగింది. రచయిత శ్రీ కరణం సుబ్బారావు చర్వితచర్వణంగా అదే వాదనను తెలుపుతూ జాబు వ్రాశారు తప్ప కొత్తఅంశం ఒక్కటీ లేదు. మిగిలిన 9 మంది పెద్దలు నేటికీ ఏమీ బాబు వ్రాయలేదు.

ఈ చర్చపై స్పందిస్తూ ప్రముఖ రచయిత్రి శ్రీమతి రంగనాయకమ్మగారు "ఈ చక్కని పాడియావు ఎవరిది?"అనే శీర్షికతో చిలకమర్తిదేనని సమర్థిస్తూ ఏకంగా పుస్తకాన్నే ప్రకటించారు. దీనిని బట్టి ఈ పద్యానికి ఆమె ఎంత ప్రాధాన్యత నిచ్చారో తేటతెల్లమవుతోంది.

***శ్రీ కరణం సుబ్బారావు జూన్ 2010లో మరొక పుస్తకం "ఆ పాడియావు చిలకమర్తికాదు" అని విడుదలచేశారు. అందులో కూడా వారు కొత్తవిషయాన్ని దేన్ని ప్రతిపాదించలేదు.***

ఈ పద్యం చిలకమర్తిదేనని రాష్ట్రపతి సన్మానితులు శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి, జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి గ్రహీత శ్రీ సి.బి.వి.ఆర్.కె. శర్మ (దివాన్ చెర్వుశర్మ) ది. 16-08-2009 ఆదివారం ఉదయం 11.30 గంటలకు ఈ టి.వి.2 లోని "తెలుగు వెలుగు"లో ప్రసారమైన కార్యక్రమంలో ప్రకటించారు.

ప్రముఖ కవి డా॥ ఆవంత్స సోమసుందర్, ప్రముఖ విమర్శకులు, పండితులు, ఆంధ్రవిశ్వావిద్యాలయ విశ్రాంత ఆచార్యులు డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి గారలు తమ వ్యాసాలను పంపినందుకు సర్వదా కృతజ్ఞతలు. ఈ పుస్తకంలోని ఇతర వ్యాస రచయితలకు, పుస్తక ప్రచురణలో విశేషంగా సహకరించిన డా॥ అరిపిరాల నారాయణరావు, శ్రీ వి.ఎస్.ఎస్. కృష్ణకుమార్ గార్లకు ధన్యవాదాలు. నన్ను ప్రోత్సహించిన బంధువులకు, మిత్రులకు, డి.టి.పి. వర్క్ చేసిన అగ్ని గ్రాఫిక్స్ వారికి, ప్రింటింగ్ చేసిన మహేశ్వరి ప్రింటర్స్ & బైండింగ్ వర్క్స్ వారికి అభివందనాలు.

రాజమహేంద్రి

15-09-2010

పెరుమాళ్ళ రఘునాథ్

కార్యదర్శి

## విషయసూచిక



# భరతఖండంబు - రసవత్తర చర్చ

గౌ.సంపాదకుడు : శ్రీ సుదర్శన్

**ది. 13-06-2009 ప్రజాపత్రిక నిర్వహించిన "ఆ పద్యం ఎవరిది"పై రసవత్తర చర్చ కరణం గారు మరిన్ని ఆధారాలు చూపాలని పలువురి సూచనలు**

జాతీయకవి చిలకమర్తి కీర్తికి మసిపూస్తూ 'భరత ఖండంబు...' పద్యం ఆయన రాయలేదంటూ సత్య శోధన పేరుతో శ్రీ కరణం సుబ్బారావు రాసిన 'ఆ పద్యం ఎవరిది' పుస్తకం పై రాజమండ్రిలో రసవత్తర చర్చ జరిగింది. ప్రజాపత్రిక ఆధ్వర్యంలో ధర్మంచర కమ్యూనిటీ హాలులో ఆదివారం జరిగిన ఈ చర్చలో అనేకమంది పండితులు, రచయితలు పాల్గొన్నారు. పుస్తక రచయిత శ్రీ కరణం సుబ్బారావు, ఆ పుస్తక ప్రచురణకు సహకరించిన శ్రీ సన్నిధానం నరసింహాశర్మ, **శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి కూడా ఈ చర్చలో పాల్గొని వారి అభిప్రాయాలు చెప్పడం విశేషం.** ఈ చర్చకు ప్రజాపత్రిక గౌరవ సంపాదకుడు సుదర్శన్ అధ్యక్షత వహించగా, అమరం సంపాదకులు శ్రీ తోటకూర కృష్ణమూర్తి రాజు న్యాయ నిర్ణేతగా వ్యవహరిం చారు. ప్రముఖ సాహితీవేత్త ప్రజాపత్రిక కుటుంబ సభ్యులు ఫణినాగేశ్వరరావు సభను పర్యవేక్షించారు. సుమారు నాలుగు గంటల పాటు ఏకబిగిన జరిగిన ఈ చర్చావేదికలో మొదట డాక్టర్ గూటం స్వామి తన వాదనను వివరించారు. ఈ పద్యం చిలకమర్తి రాయలేదంటూ 1948 ప్రాంతంలోనే భారతిలో ఒక వ్యాసం ప్రచురించబడిందని దానిని తాను పన్నెండేళ్ల క్రితం చూసానని చెప్పారు. అయితే, ప్రస్తుతం ఆ వ్యాసం కాపీ లేకపోయిందన్నారు. ప్రస్తుతం కరణం గారు పేర్కొన్న ఏ ఒక్క ఆధారమూ సప్రమాణంగా లేదన్నారు. పైగా, పుస్తకంలో పెద్దలపట్ల ఆయన వాడిన భాష సమంజసంగా లేదని ఘాటుగా విమర్శించారు. ప్రజాపత్రిక సుదర్శన్ తన వాదన వినిపిస్తూ, నూట ఎనిమిది పేజీలతో అచ్చయిన ఈ పుస్తకంలో ముందు భాగంలో 38 పేజీలు ముందుమాట, వివిధ రచయితల అభిప్రాయాలే ఉన్నాయని, మిగిలిన 70 పేజీల భాగంలో చిలకమర్తి, భానుమూర్తిల గురించి వ్యాసాలు వ్రాసారని వాస్తవానికి శ్రీ కరణం గారి సత్యశోధన కేవలం 16 పేజీలు మాత్రమేనని విడమరచి విశదీకరించారు. అందులో కూడా 'ఇది తగదు',

"ప్రజాపత్రిక" 21-11-14/3, కోర్లమ్మపేట,
దేవీచౌక్, రాజమహేంద్రి 533 104

'కళ్ళు తెరచి చూద్దాం' అనే శీర్షికలు ఉన్నాయని, ఇది తగదులో ఇవి ప్రామాణిక గ్రంథాలా అంటూ ఈ పద్యం చిలకమర్తిదని గతంలో ఉటంకించిన వారిని ఎత్తిపొడుస్తూ రచన సాగించా రన్నారు. ఇందులో ఆయన వివిధ పోటీపరీక్షల గైడ్లను కూడా ప్రామాణిక గ్రంథాలుగా పేర్కొనటం హాస్యాస్పదంగా వుందన్నారు. పైగా మహాకవి మధునాపంతుల వారు చిలకమర్తి పద్యంపై అసలు ప్రస్తావనే చేయలేదని పేర్కొని నింద చేయడం తగదన్నారు. సన్నిధానం వారు చూపిన కుముదపల్లిలోని గ్రంథాలయ కేటలాగు (యాక్సేషన్ రిజిష్టర్)లో భారత ధర్మ ధర్శనం చెన్నాప్రగడ వారిదిగా పేరుందని వాదించడం ఎలా ప్రామాణికమవుతుందని సుదర్శన్ నిలదీసారు. మన రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయ కేటలాగులో 336 నెంబరుతో వున్న చోట రచయిత పేరు ఖాళీగా వుండటం గమనించాలన్నారు. పుస్తకంపై రచయిత పేరు లేకుండా కేటలాగులో వుండటం ఆ కేటలాగు లోపం అవుతుందేగాని, సత్యనిరూపణకు ఆధారం ఎలా అవుతుందని ఆయన ప్రశ్నించారు. అలాగే శ్రీ పోతుకూచి వారు 1959లో, చెన్నాప్రెగడ వారి కావ్యకుసుమాంజలి ప్రచురణ సమయంలో తాను చేతి వ్రాత చూశానని చెప్పడం, అది ఒక గొప్ప ఆధారంగా శ్రీ కరణం వారు స్వీకరించడం కూడా సమంజసం కాదన్నారు. చేతి వ్రాత ప్రతిపై రచయిత పేరు లేదని శ్రీ పోతుకూచి వారే పేర్కొంటున్నపుడు ఆయన చేతిరాత ఉన్నంత మాత్రన అది ఆయన రచనే అనడం ఎలా ప్రామాణికమవుతుందని సుదర్శన్ ప్రశ్నించారు. అలా అయితే మన రాజమండ్రిలోని నేదునూరి గంగాధరం గారు వేలాది జానపదగీతాలను చేతితో రాసుకుని భద్రపరిచారని, అది ఆయన చేతిరాత కనుక అవి ఆయనే రాసాడని స్థిరీకరించవచ్చా? అని ఆయన సూటిగా ప్రశ్నించారు. కేవలం ఈ రెండు ప్రమాణాల చుట్టూనే ఆయన సత్యశోధన సాగిందని సుదర్శన్ పేర్కొన్నారు. భాష విషయంలో శ్రీ కరణం వారు సంయమనం పాటించాలని తెలుగు జాతీయాలను ఎలా పడితే అలా వాడి అదేదో ప్రజ్ఞ అనుకుంటే పొరపాటని సుదర్శన్ ఎత్తిపొడిచారు. రాష్ట్రపతి అవార్డు గ్రహీత శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి మాట్లాడుతూ భారత ధర్మ దర్శనంలోని నక్షత్రమాలలో మొదటి పద్యంగా భరత ఖండంబు పద్యం కొటేషన్ల మధ్య ఉండటం కీలకంగా భావించాలని ఆ పద్యం తనది కాదు కనుకనే ధర్మ దర్శన రచయిత కొటేషన్లు పెట్టారని. ఎవరిదైనా ఎవరిదైనా పద్యం కాని వాక్యం గాని తన రచనకు అనుకూలంగా ఉపయోగించుకుంటే కొటేషన్లు



పెట్టడం భాషా సంప్రదాయమని ఆయన పేర్కొన్నారు. నక్షత్రమాలలో 28 పద్యాలుండటం కూడా ప్రసావిస్తూ అభిజిత్తు అనేది ఇక్కడ వర్తించదన్నారు. డాక్టర్ ఎంఆర్‌వి శర్మ కూడా నక్షత్రమాలలో 28వ పద్యంపై సాధికారికంగా మాట్లాడారు. చిలకమర్తి వారి బంధువు శ్రీ పెరుమాళ్ల రఘునాద్ మాట్లాడుతూ కరణం వారు మరిన్ని ఆధారాలతో ముందుకు రావాలన్నారు. రాష్ట్రపతి పురస్కార గ్రహీత శ్రీ సిబివిఆర్‌కె (దివాన్ చెఱువు) శర్మ 18 పేజీల డిటిపి చేయించిన సాధికార సప్రమాణ పత్రాన్ని తీసుకొచ్చి చదువుతూ పుస్తకాన్ని చీల్చి చెండాడారు. కరణం వారి పుస్తకంలో ప్రతి పదాన్ని ఆయన సాక్ష్యాలతో తప్పులని స్పష్టం చేశారు. అయితే సమయాభావం వల్ల ఆయన ప్రసంగాన్ని కుదించమని ముఖ్యమైన సాక్ష్యాలు ప్రదర్శించమని కోరడంతో ఆయన అలాగే చేసి వ్యాసాన్ని నిర్వాహకులతోపాటు అందరికి 50 జిరాక్స ప్రతులను పంచిపెట్టారు. డా॥ డిఎస్‌వి సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ పుస్తక రచయిత అనేకచోట్ల మర్యాద అతిక్రమించా రన్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇది విమర్శతో కూడిన రచన కాదని కరణం వారికి విమర్శ చేయడం చేతకాదని డా॥ సుబ్రహ్మణ్యం దుయ్యబట్టారు. శ్రీ ఈమని కృష్ణమూర్తి మాట్లాడుతూ కవులు కొన్ని పదాలు వాడేటప్పుడు ఒళ్లు దగ్గర పెట్టుకో వలసిన అవసరం ఉందని, కులాలు, మతాలు పోవాలని కోరుకుంటున్న నేటి కాలంలో ఇంకా నియోగి, వైదీకి వంటి పదాల వాడకం తీవ్రఅభ్యంతరమన్నారు. డా॥ బివిఎస్ మూర్తి మాట్లాడుతూ అసలు ఈ పుస్తకావిష్కరణ సభను రాజమండ్రిలో నిర్వహించడమే రాజమండ్రి కవులకు సిగ్గుచేటైన విషయమని అటువంటి పనిని ప్రోత్సహించిన స్వార్ధపరులను తీవ్రంగా గర్హించాలన్నారు. అయితే ఆయన వాడిన స్వార్ధపరులనే పదాన్ని సభా నిర్వాహకులు వెంటనే ఖండించారు. సాహితీవేత్త ఫణినాగేశ్వరరావు మాట్లాడుతూ చిలకమర్తిని మిత్రద్రోహిగా పేర్కొన్న రచయిత కరణం రాతలు తీవ్ర అభ్యంతరకరమైనవని ఈ విషయంలో ఆయన క్షమాపణ చెప్పాలన్నారు. ఇటువంటి పుస్తకాన్ని నిషేధించవలసిన అవసరం ఉందని స్పష్టం చేశారు. సభలో సన్నిధానం నరశింహశర్మ మాట్లాడుతూ తాను పుస్తక రచయితకు సేకరించి ఇచ్చిన కేటలాగు మలి పరిశోధనకు ఒక చిన్న ఆధారంగా ఉపయోగ పడుతుందే కాని, అదే ప్రమాణంగా చూపలేమన్నారు. పోతుకూచి వారు మాట్లాడుతూ తాను చూపిన ఆధారం – ఖచ్చితంగా ఆధారమేనని పేర్కొన్నారు. అది ఎలా ప్రమాణమో చెప్పాలని నిర్వాహకులు నిలదీసారు. అయితే

ఆయన తన పంథాలోనే మాట్లాడారు తప్ప సరియైన సమాధానం చెప్పలేదు. ఇక పుస్తక రచయిత కరణం సుబ్బారావు చర్చావేదికలో వక్తల ప్రసంగాలకు సమాధానం చెప్పటానికి బదులు తన పుస్తక రచనావిధానంలో తాను ఎదుర్కొన్న కష్టాలు వగైరా చెప్పడం ప్రారంభిం చారు. నిర్వాహకులు ఆయన ప్రసంగాన్ని అడ్డుకొని సూటిగా ఐదు ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలని నిలదీశారు.

1. సన్నిధానం వారు ఇచ్చిన కేటలాగు ప్రమాణంగా అంగీకరిస్తున్నారా?
2. పోతుకూచివారు చూపినట్లు చెబుతున్న – రచయిత పేరులేని – చేతి వ్రాత ప్రతి ఉన్నంత మాత్రాన అది ఆయన రచన అయిపోతుందా? దానిని ప్రమాణంగా ఎలా స్వీకరిస్తారు?
3. ముందుమాటలతో రచయితకు పెద్దగా సంబంధం లేకపోయినా ఆ పుస్తకం ముందుమాటలలో ప్రొ॥ జయధీర్ తిరుమలరావు గారు పేర్కొన్న విగ్రహాల అనేపదాన్ని మీరు అంగీకరిస్తున్నారా? మీ దృష్టిలోకూడా వీరేశలింగం గురజాడలు విగ్రహాలేనా?
4. చిలకమర్తి వారిని మిత్ర భేదానికి పాల్పడ్డ వ్యక్తి అని, మానవత్వం లేని వాడని నిందమోపడం తప్పా, కాదా?
5. పొరబాటును సరిదిద్దుకొని పశ్చాత్తాప పడనివాడు అసలు మనిషేకాడని మీరు పుస్తకంలో పేర్కొన్నారు. ఈ పుస్తకంలో ఇన్ని తప్పులను ఈ చర్చలో వక్తలు చూపిస్తున్నారు కనుక మీరు పశ్చాత్తాప పడి మనిషిగా ప్రవర్తిస్తారా?

అని సభాముఖంగా ప్రశ్నించే సరికి శ్రీ కరణం వారు దేనికి సమాధానాలు చెప్పలేదు. మొండిగా తన వాదాన్ని సమర్థించుకున్నారు. చివరకు ఆయన తన పరిశోధనకు మరిన్ని ఆధారాలు వెతుక్కుని వాదనకు ముందుకు రావాలని సరైన సాక్ష్యాలతో చెన్నాప్రగడ వారే ఈ పద్యం వ్రాశారని ఋజువుచేస్తే ఇదే వేదికపై ప్రజాపత్రిక తరపున ఘనసన్మానం చేస్తామని నిర్వాహకులు ప్రకటించి చర్చను ముగించారు. చివరగా "అమరం" సంపాదకులు శ్రీ కృష్ణమూర్తి రాజు వందన సమర్పణం చేశారు.

## "పాడి ఆవు" పద్యాన్ని భానుమూర్తిది అనే వారంతా ఫోర్జరీలే

**– డా॥ అవంత్స సోమసుందర్**

దాదాపు ఏడాది క్రితం ఒకనాడు ఆంధ్రజ్యోతి "వివిధ" పుట చూస్తుంటే ప్రొఫెసర్ ఎస్.వి. సత్యన్నారాయణ "భరతఖండము చక్కని పాడి ఆవు చిలకమర్తిది కాదు భానుమూర్తిది" అని ఒక ఉద్ఘాటన పడింది. నేను ఆశ్చర్యపోయాను. 1944 సం.ము లో చిలకమర్తి వారి నడిగి వారి స్వీయచరిత్రను తెచ్చుకొని ప్రచురించినది మా అభ్యుదయ రచయితల సంఘం. వారికి ఉదాత్తంగా ధనమిచ్చి విజయవాడలో రామమోహనరాయ గ్రంథాలయములో వారికి గొప్ప సన్మానము చేసినదీ అభ్యుదయ రచయితల సంఘమే. చిలకమర్తి వారు స్వీయచరిత్ర రచించిన తరువాత రాజమహేంద్రిలోని సాహిత్యపరులందరికి ఆ విషయం చెబుతూ వచ్చారు. ముఖ్యంగా సహృదయుడు సాహిత్యవేత్త ప్రగతిశీలి అయిన శ్రీ మహీధర జగన్మోహనరావు ఆ గ్రంథాన్ని ఆమూలాగ్రంగా వారింట కూచుని చదివాడు. ఆ గ్రంథాన్ని ఎలాగైనా అచ్చువేయించాలని ఆ భాగ్యం అభ్యుదయ రచయితల సంఘానికే దక్కితే అంతకన్నా ఆనందదాయకమైనదేదీ ఉండదని ఆయన విశ్వసించారు. ఆ విషయం అరసం ముఖ్యులందరికీ ముఖ్యంగా చదలవాడ పిచ్చయ్య (కార్యదర్శి) తుమ్మల వెంకట్రామయ్య ప్రభృతులు అందటికీ చెప్పాడు, వారానందించారు. జగన్మోహనరావుగారితో "..మనం తప్పక అచ్చువేద్దాం డబ్బుల కోసం మేము దండడం ప్రారంభిస్తాము. ఆయన్ని ప్రార్థించి ప్రచురించడానికి మనకు అనుమతి ఇవ్వడానికి ప్రయత్నించండి" అని చెప్పాము. ఆ నిర్ణయం ఉభయత్ర ద్విగ్విజయంగా అమలు జరిగింది. ముద్రణకు అయిన వ్యయం ఆ చౌక రోజుల్లో కూడా భారమైనదే! అదికాక పుస్తక ముద్రణ అయిన తరువాత చిలకమర్తి వారిని బెజవాడకు తీసుకురావడం, వారికి కనీసం వెయ్యి నూటపదార్లు ఇచ్చి సన్మానం చేయడం అని కూడా ఆనాడు అరసం నాయకులు నిర్ణయించుకున్నారు. పుస్తకం బెజవాడలోనే ఆవిష్కరించాలని, తొందరగా ముద్రణ పూర్తి చేయడం కోసం సహకరించే మంచి ప్రెస్సుకు ఇవ్వాలని నిశ్చయించారు. జగన్మోహనరావుగారు రాజమండ్రి వచ్చి చిలకమర్తి వారిని సంప్రదించి వ్రాతప్రతిని స్వయంగా తీసుకెళ్ళారు. దాదాపు ఐదారు నెలల్లో పుస్తకంగా తయారవడం ఆవిష్కరణ సభ బెజవాడలో రామమోహనరావు గ్రంథాలయంలో జరగడం అది చిలకమర్తి వారి సభ గనుక అస్మదాదులం వెళ్ళి పాల్గొనడం జరిగింది.

కళాకేళినికేతన్, పిఠాపురం.

"పుస్తకం ముగించి ఏడాది కాకపోయినా నేను ప్రేమించిన ప్రజల చేతుల్లోకి తీసుకు వెళ్తున్న నాయక మిత్రులు, అభ్యుదయ రచయితల సంఘం వారిని అభినందిస్తున్నాను" అంటూ ప్రారంభించి చిలకమర్తి చాలా దీర్ఘంగా ఉపన్యసించారు. ఆయన ఉపన్యాసం మరునాడు ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, ప్రజాశక్తి పేపర్లలో చాలా విపులంగా ప్రచురింపబడింది. యువతరం రచయితలమైన మాకు గొప్ప సాహిత్యపు విందు ఏర్పడింది. ఆ సన్నివేశాన్ని బతుకుపొడుగునా తలచుకుంటూ గుండెల్లో భద్రంగా దాచుకున్నాను.

ప్రొ॥ ఎస్.వి. ఆరంభ యవ్వనకాలం నుండీ మా అరసానికి చెందినవాడు. స్వీయచరిత్ర మొదటి ముద్రణ మా అరసమే ప్రచురించి దేశ ప్రజలకు విందు చేసింది. ద్వితీయ, తృతీయ ముద్రణలు పశ్చిమ గోదావరి జిల్లా నత్తా రామేశ్వరం వారు ప్రచురించి ఎంతో సత్కార్యము చేశారు. ఆ ముద్రణలు కూడా చెల్లిపోయి స్వీయచరిత్ర దొరకక గ్రహణం పట్టిన దశలో బహుశా ఎస్.వి. కొందరు ఫోర్జరీవాదుల ఉత్తుత్త బుకాయింపులకు కొట్టుకుపోయి "వివిధ" లో ప్రకటన చేసి ఉంటాడు. లేకపోతే అరసం నాయకులలో ఒకడైన ఎస్.వి.కి ఈ దుశ్చింత కలిగేది కాదు.

అసలీ దుష్ప్రచారానికి కారణభూతుడైన వాడు నా ప్రియమిత్రుడు శ్రీ పోతుకూచి సూర్యనారాయణే అని తెలిసికొని మ్రాన్పడిపోయాను. అతడి లాంటి ఫోర్జరీ గొడవలకు పూనుకునేవాడు కాదని నాకు చిరకాలంగా ఒక నమ్మకం. శ్రీ పోతుకూచి సూర్యనారాయణ నాకు కనీసం 50 ఏళ్ళుగా మిత్రుడు. న్యాయవాదిగా రాణిస్తున్నాడే కాని లిటిగెంటుగా దిగజారిపోతున్నవాడిగా నాకెప్పుడూ అనుమానం కలుగలేదు. సాహిత్యం పట్ల ఉదారమైన అభిమానం ఉన్నవాడే తప్ప చిన్నయసూరి చెప్పినట్లు బొక్కలు తవ్వే గుణమున్నట్లు నేనెన్నడూ అనుమానించలేదు. పైగా కాలగర్భంలో నుండి త్రవ్వి బైటకు తీసి చరిత్రపుటలను విస్మరించిన భానుమూర్తి అనే "నస్మరంతి" ని బయట పెట్టి ప్రాణం పోసి పిండివిఘ్నేశ్వరుడిగా నిలబెట్టిన వాడుగా పోతుకూచి కాగలడని నేనెప్పుడూ అనుమానించలేదు. ఇతడు కొన్ని దశాబ్దాల క్రితం భానుమూర్తిగారి కుసుమాంజలి అనే పుస్తకం బయటపెట్టి ఈ ధర్మదర్శనానికి అధర్మకీర్తి కలిగించాడని నాకు తెలియదు.

బిపిన్ చంద్రపాల్ గారు రాజమండ్రి వచ్చి అద్భుతమైన దేశభక్తి ఉపన్యాసాలతో శ్రోతలను పొంగు లెత్తిస్తున్న సమయంలో ఆ ఉపన్యాసాలకు తెలుగు



అనువాదకుడిగా చిలకమర్తి పనిచేశారు. అలా ఎన్నో ఉపన్యాసాలు గడిచాయి. "కడపటి దినమున సభలో కూర్చుండి నా మనసులో ఊహించుకొని యీ క్రింది పద్యమును కట్ట కడపట చదివితిని" అని

తే.గీ. భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను గడుసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి.

అనే పద్యం చిలకమర్తివారు ఉద్రేకంగా చదివి వినిపించారు. శ్రోతలందరి మనస్సుల్లోకి వెళ్ళింది. ఈ పద్యం శ్రోతలందరూ మననం చేసుకున్నారు. గోడల మీద, తూముల మీద ఎక్కడ పడితే అక్కడ వ్రాసి ప్రచారం చేసారు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలతో ఉద్రిక్తులైన శ్రోతలు తమ దేశభక్తిని ఆ పద్యం ద్వారా చాటుకున్నారు. దానిని చిలకమర్తికి మిత్రుడైన చెన్నాప్రగడ భానుమూర్తిగారు తమ ధర్మదర్శనం అనే పుస్తకంలో నక్షత్రమాల అనే 27 పద్యాలకు బీజావ్యాప్తి కలిగించిన తన మిత్రుని పైపద్యాన్ని శీర్ష స్థానంలో ఉటంకించుకున్నారు. ఆ పద్యం తనది కాదని చెప్పడానికి పద్యం ముందు 'క' అక్షరాన్ని, కొటేషన్న్ని, పెట్టారు. ఈ 'క' అనే అక్షరానికి వారు ఉద్దేశించిన అర్థమేమిటో మనకు తెలియదు. బహుశా చిలకమర్తి అనే పదంలో 'క' అనేది ప్రాణతుల్యమైనది. దానిని మినహాయిస్తే అటు చిల - ఇటు మర్తి మిగులుతాయి. ఆ రోజులలో యితర చోట్ల కూడా చిలకమర్తి పేరునకు ప్రత్యామ్నాయంగా "క" అను అక్షరం వాడటం అనేది అలవాటులో ఉండేది. ఇందుకు ఉదాహరణగా న్యాపతి సుబ్బారావు గారు 1895 సం.ములో తన అధ్యక్షతన కాకినాడలో జరిగిన "రాజకీయ సభలో" - "క" వ్రాసిన పద్యాలు కూడా ఉన్నాయని, వాటిని కూడా ఆంగ్లములోనికి అనువదించవలసిందిగా గురజాడ అప్పారావు గారిని కోరుతూ లేఖ వ్రాసారు. ఇక్కడ "క" అను అక్షరాన్ని చిలకమర్తి వారికి బదులుగా న్యాపతి సుబ్బారావు గారు వాడారని ఆనాడు గురజాడ వారితో సహా సాహిత్యవేత్తలందరికి తెలుసు. అందుచేత భానుమూర్తి కూడా "క" అను అక్షరాన్ని పద్యము ముందున చిలకమర్తి వారికి సాంకేతిక పదంగా లేదా గుప్తనామంగా వాడుకున్నాడేమో. భానుమూర్తి కూడా కవే కదా! ఈ తొలిమాటలతో

గీ॥ వసుమతీదేవి భర్తయౌవాసుదేవు
దర్శనము చేయలజ్జించి తాల్చినట్టి
తెల్లపట్టు మేల్ముసుఁగటు తేజరిల్లు
నీ యుషః కాల చంద్రికలింపులలర! (గయో. 1వ అం)

గీ॥ నిశయుఁబవలును, నవ్వు వెన్నెలలుఁగాయు
మీ ముఖేందు మండలములు భూమిఁ గలుగఁ
దన యునికి నిష్ప్రయోజనంబని యెఱింగి
యరుగుచున్నాడు సిగ్గున నబ్జవైరి (గయో. 1వ అం)

గీ॥ అబ్జహితుఁడను కారాగృహాధికారి
కిరణమను తాళఁపుంజేతఁ గీలెడల్చి
దళములను తల్పులను దీయవెలికి వచ్చుఁ
దుమ్మెదలు తమ్మిచెఱ నుండి దొంగలట్లు!! (గయో. 1వ అం)

ఆ.వె॥ ఆయువధికమగునె యాశీర్వచన శక్తి
శాపకారణమునఁ జావుకలదె??
క్షయము, వృద్ధి సకల జంతుజాలమునకుఁ
గాలవశము చేతఁ గలుఁగు గాక!! (గయో 2వ అం)

అలాగే " భల్లట శతకం" లోని పద్యాలు కూడా ఎంతో హృద్యమై ప్రసాదగుణంతో అలరారుతాయి. " కూస్తున్నది కదా అని ఈల పురుగు శబ్దాన్ని పవిత్రమైనదిగా ఎంచనక్కరలేదు. శంఖనాదం మాత్రమే గౌరవనీయము" అని వక్కాణిస్తున్నారు. అలాగే మిగతావి కూడా

గీ॥ బాటలోనున్న చెట్టెక్కి భయము లేక
యీల పురుగు కూయును గాక చాలసేపు
నిఖిల దిక్కుల శబ్దంబు నిండఁ జేయు
శంఖమే మానవీయంబు, జనులకెట్ల (భల్లట శతకం. 24)



గీ॥ ద్యుమణికే దక్క నింకఁ జంద్రునికినైన
సార్థకముగాదు ఖద్యోతశబ్దమవని,
నట్టియెడ నల్పసంతుష్టుఁడౌ నెవండీ
మఱుఁగుఱున కిచ్చెనా పేరు మీఁదరయక. (భల్లట శతకం 12)

గీ॥ ఓసి చింతామణీ! వంతనొందఁబోకు.
తగిన ప్రభువొందలను నిన్నుఁదాల్పఁడనుచు,
నిఖిల సౌభాగ్య బీజమౌ నిన్నుఁ దాల్చు
పున్నెమును గన్న మూర్ధంబు పుడమి లేదు! (భ.శ. 48)

"అవిమారకం" అనే ఆయన నాటకంలో కూడా ఎన్నో పద్యాలు చమత్కార యుతంగావుంటాయి చూడండి

గీ॥ పుత్త్రసహితుఁడైయారాజు పోయె నెటకొ!
జరుపుచున్నారు కార్యముల్ సచివులరసి!
రాజగృహము బ్రవేశింపరాదు గాన
నేమి హేతువో యీ స్థితి కెరుగరాదు!! (అవిమారకం నాటకం 1వ అం)

గీ॥ కనుఁగవయె గాని నాకు వేగనులు లేవు
చిత్తమతిమూఢమభిలాష చిరతరంబు
కామవార్థికిఁ బారంబుఁ గంటి నేఁడు
కలికి! క్రీడింపనిమ్ము నాకన్నుఁగవను!! (అవిమారకం నాటకం 3వ. అం)

. ఇంత హృద్యమైన పద్యాలు ఆయన సర్వకావ్యాలలోను చమత్కారయుతంగా సౌకుమార్యంగా ప్రతిష్ఠిత మవుతాయి. అప్రయత్నంగా స్వయం ప్రకాశం కలిగిస్తాయి. పోతే భానుమూర్తి గారి పద్యాలను పరిశీలనగా చూస్తే వారి శైలి గురించి మనకు సందేహం లేని ఒక అభిప్రాయం ఏర్పడుతుంది. యతిప్రాసల కోసం వెదుకులాటలు కనిపిస్తాయి. భారత ధర్మదర్శనమంతా మనం ఉల్లేఖించు కొనక్కరలేదు గాని ఒక్క నక్షత్రమాలలోని ఆయన పద్య రచనా నైపుణికి రెండు మూడు ఉదహరించుకొని పరిశీలించుకోవచ్చు.

1. "కూటికేమియు మనలకు కొదువలేదు
కోటిలన్నియు పోయెదు గుడ్డలకై
ఆ ప్రవాహంబునాపంగ నానకట్ట
గా మనకు కలిగెగా పరిష్కారమరయ"

2. ముతక బట్టలు కట్టుట మోటుదనమ
టంచు వెంగుళులై మన మెంచ జనదు
హృదయమందున ఔదార్యమొసగకున్న
కల్లమెరుగుల నాగరికంబుగాదు

3. వేద వేదాంగములు కన్న విప్రులెల్ల
నార చీరలు గట్టి రనాగరికులె?
కుచ్చుపాగాలు చుట్టి వ్రేల్గోచి జార
నగరితిరిగెడు కూళలు నాగరికులె?

ఇలాంటి పేలవత్వానికి నిదర్శనంగా వారి 27 పద్యాలు సాక్ష్యమిస్తాయి. ఇలాంటి నీరస కవిత్వం వ్రాసినందునే ఆయనను జాతి మరచి పోయింది. కవిగా ఆయన పేరు సోదిలోకి రాలేదు. అందుకే దుఃఖితమతులైన మృషాసాహితీ పరిశోధకులకొక అవకాశం దొరికింది. ఎలాగైనా ఆయన పేరుతో బాటు తమకీ కాస్త కీర్తి లభిస్తుందన్న ఆశతో ఇంత పితూరిలేవదీశారు. అంతకన్నా కారణమేమి లేదు. "భరతఖండము చక్కని" పద్యం భానుమూర్తిగారికి బాగా నచ్చి తన నక్షత్రమాలలో మొట్ట మొదట పెట్టి, అది ఇతరులదని తెలిపే విధంగా దానిని కొటేషను మార్కులు కూడా పెట్టేరు కదా. ఆ పద్యం క్రింద చిలకమర్తి వారి పేరు ఎందుకు వ్రాయలేదంటే అసలు ఆ పుస్తకం మీద భానుమూర్తి గారు తన పేరు వ్రాసుకోలేదుగదా" అని స్పష్టపరచిన రంగనాయకమ్మ తీర్పు తిరుగులేనిది" రంగనాయకమ్మ కలుగచేసుకుని సత్యం కోసం యింత పోరాటం జరిపిన తరువాత "చక్కని పాడియావు" భానుమూర్తిదే అనుకొనే వాళ్ళను భగవంతుడొక్కడే క్షమించాలి. 'చిలకమర్తి' 'భానుమూర్తి' బాల్యంలో స్నేహితులట. కలసి వీరవాసరంలో



చదువుకొన్నారట. ఆయన చిన్నప్పటి నుండి పద్యాలు వ్రాయడం చూసి తనకు ఉత్సాహం కలిగి తాను కూడ పద్యాలు వ్రాయడం ప్రారంభించానని స్వీయచరిత్రలో చెప్పుకున్నారు. ఆయన సత్యవాది. ఏ ఆడంబరాల కోసమో ఎవరినీ తగ్గించలేదు. ఏ స్వలాభం కోసమో ఎవరినీ పొగడలేదు. చిలకమర్తి వారు ఎంత నిరాడంబరుడో అంత జనప్రీతి కలవాడు. ఆయన దగ్గరకు వెళ్ళి (బహుశా నాకు 13 ఏండ్లు ఉంటాయోమో) పిఠాపురం కార్నేషన్ బంగళాలో రఘుపతి వెంకట రత్నం నాయుడు గారి అధ్యక్షతన జరిగిన సభలో వారు ఉపన్యాసం ఇచ్చిన తరువాత ఎందుకో నాకు వారి పాదాలకు నమస్కరించాలనిపించింది, వెళ్ళి చేసాను. ఆయన దగ్గరగా లాగుకొని కౌగిలించుకొని నాకొక శాశ్వతమైన పులకరింత కలిగించారు. గుండ్రని మొఖం, గుండ్రని మనిషి, లాంగ్ కోటు జేబులోంచి వేలాడే వాచీ గొలుసు, చేతిలో కర్ర ఎప్పటికీ మర్చిపోలేను. అదృష్టవశాత్తు ఆయన రచించిన వివేక వాచకాలు ఆరవ తరగతి నుండి 3 ఫారం వరకు చదువుకొన్నాను. అందులో వాచకం కోసమని కథలు కూడా ఆయనే రచించారు. 3 ఫారం వాచకంలో ఒక కథనేనిప్పటికీ మర్చిపోలేను. అతిథి కోసం వెతికి తెచ్చిన గృహస్తు ఆ అతిధి దేవతార్చన చేయకుండా భోజనం చేయబోతుండగా యజమాని ఆ అతిథిని కొట్టబోతే భగవంతుడు ప్రత్యక్షమై "నీవు నాకు భక్తుడవా! ఒక్క క్షణం అతనిని ఓర్చలేకపోయావు! భోంజేస్తున్నాడని కొట్టావు. నేను వాడు పుట్టిన దగ్గర నుంచి క్షమిస్తూనే ఉన్నాను". అని అంతర్ధానమౌతాడు. ఈ కథ ద్వారా భక్తి ప్రపత్తులు, దేవతార్చనా వంటివి నిర్బంధం ద్వారా వచ్చేవి కావని తాత్పర్యము.

ఈ వాచకాలలో ఆయన కల్పించిన ఇలాంటి చిన్న కథలన్నీ హేతువాదబద్ధంగా ఆలోచనా స్ఫోరకంగాను ఉండేవి. ఈ వివేక వాచకం గురించి ఆయన స్వీయచరిత్రలో వ్రాసుకుంటే చదివినప్పుడు నాకెంతో ఆనందం గలిగింది. ఆయన వాక్కు నిరాడంబరమైనది. దేని గురించి అతిశయోక్తులు పలికేవారు గారు. తన గురించి చెప్పుకోవలసి వచ్చినపుడు మరీను. చిలకమర్తి వారు నడిపే మనోరమ పత్రికలో భానుమూర్తి గారి ధర్మదర్శనం గురించి 1907 నవంబరు, డిసెంబరు నెలల సంచికలోనే సమీక్ష వెలువడింది. సమీక్ష కుడి పేరు లేదని రంగనాయకమ్మ చెప్పారు. అసలీ పుస్తకం గ్రంథకర్త పేరు లేకుండానే అచ్చయింది. ఆ విషయం మరచిపోకూడదు. ఆ పద్యాలు అచ్చయిన పుస్తకాన్ని చిలకమర్తి వారు కంటితో

చూడలేదు. ఆయనకప్పటికే అంధత్వం దాపురించింది. నీహార లేశమంత విషయం తీసుకొని మహాసముద్రమంతగా భావించి భయపడే విమర్శకమ్మన్యులు ఉత్తరోత్తరాపుడతారని ఆనాటి చిలకమర్తి గాని, భానుమూర్తిగాని వేమరపు రామదాసుగాని ఊహించి ఉండరు. సాహిత్య సృజనాశక్తి లోపించిన వారికి ఇలాంటి మీనమేషాల పట్ల ఆసక్తి మెండు.

ఆ గ్రంధాన్ని సంపాదించి ముద్రణకు ఇచ్చిన శ్రీ పోతుకూచి సూర్యనారాయణ – "తాను చూపించలేకపోయిన ఆధారాలను కరణం సుబ్బారావు చూపించి గొప్ప కృషి చేసాడని, సుబ్బారావు గారిని తెగకీర్తిస్తూ ఆయనకు అందరూ కైమోడ్పులు చేయాలి" అని ఉద్ఘాటించడం ఎంతపేలవమైన నిరాధార శరణ్యమో అర్థం చేసుకోవచ్చు. రంగనాయకమ్మ తెలిపిన సాక్ష్యం ప్రకారం చిలకమర్తి స్వీయచరిత్రలో "కాగితాల మీద వ్రాసుకోకుండా పద్యాలు నోటితో చదివాను" అని చెప్పిన సందర్భాలు అనేకం ఉన్నాయి. పైగా "చిలకమర్తి వారు అసలు పద్యకర్తే కాదని ఆయనకు అలా పేరు రాలేదని ఫైసల్ చేసిన కరణం సుబ్బారావు ఎంత గొప్ప సాహిత్యవేత్తో మనం వివరించనక్కరలేదు. నేటికీ ఆయన గయోపాఖ్యానంలో పద్యాలు ఒకటి రెండైనా నోటికి రానివాళ్లు తెలుగుదేశంలో ఎక్కడా లేరు. లేని మాయామందిరాన్ని నిర్మించడానికి సుబ్బారావు గారు తమ గ్రంథములో ఎంతో ఊక, బూడిద తెచ్చి పోగువేశారు. దానిని ఉపయోగించుకునే మరికొంత మంది ఏబ్రాసులుంటారని గ్రహించగలగడమే ఆయన విజ్ఞత?

శ్రీ పోతుకూచి 1959లో భానుమూర్తిగారి పుస్తకాన్ని పరిష్కరించి అచ్చువేయించినట్లు నాకెప్పుడూ చెప్పనూ లేదు. మా స్నేహం వయస్సు కనీసం 50 ఏళ్ళుంటాయి. ఎన్నడూ ఏ విరోధము లేదు. తెలుగు భాషలో అక్షరబద్ధమైన దేశభక్తి గీతం నిస్సంశయంగా "భరతఖండము చక్కని పాడియావు" చిలకమర్తిదేనని అదిఆంధ్ర దేశభక్తి సాహిత్యంలో ప్రథమమని దీనినంగీకరించి ఆ మహానుభావుని స్మరించుకుంటూ అనవసరపు వాదాలు లేవనెత్తిన వారంతా ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

("ఆంధ్రప్రభ"లో ప్రచురితం)

## 'భరతఖండంబు..' వివాదానికి 'భరత' వాక్యం

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

నడుస్తున్న చరిత్ర మాసపత్రిక జూలై 2009 సంచికలోని 'స్పందన'లో 'నక్షత్రాల సంఖ్య, కొటేషన్ గుర్తుల గొడవ' అని రెండు సంగతులున్నాయి. వానిలో విద్యార్థి కల్పతరువు నుంచీ, పూర్వ గాథాలహరి నుంచి నక్షత్రాల సంఖ్య విషయం, పింగళి సూరన కళాపూర్ణోయం నుంచీ, తెనాలి రామ్మని పాండురంగమహాత్మ్యం నుంచీ కొటేషన్ గుర్తుల 'గొడవ' విశేషం వున్నాయి!

విద్యార్థి కల్పతరువు విద్యార్థులికి కల్పతరువేమోగాని, విద్వాంసులికి అల్పతరువు. పూర్వగాథాలహరి పురాణకథల ప్రవాహమే. అందులోనూ, ఇందులోనూ నక్షత్రాల సంఖ్య విషయం వుందిగాని, 'నక్షత్రమాల' సంఖ్య విశేషం లేదు. కావ్యస ంబంధమైన నక్షత్రమాల అలంకారశాస్త్ర పారిభాషిక పదం. దాని అర్థం అలంకారశాస్త్రాల్లోనే వుంటుంది. విద్యార్థి కల్పతరువులోనూ, పూర్వగాథాలహరిలోనూ వుండదు;లేదు. విశ్వనాథుని ప్రతాపరుద్రీయం, విశ్వనాథుని సాహిత్యదర్పణం మొదలైన అలంకారశాస్త్ర గ్రంథాల్లో వుంటుంది. సంస్కృతం రాకపోతే వానికి తెలుగు అనువాద గ్రంథాలు వున్నాయి. అలంకారశాస్త్ర గ్రంథాలు అర్థంకావనుకుంటే, సుప్రసిద్ధమైన శబ్దరత్నాకరము, సూర్యరాయాంధ్ర నిఘంటువు, ఆంధ్రవాచస్పత్యము మొదలైన నిఘంటువులు చూచుకోవాలి. చూస్తే నక్షత్రమాల అంటే "ఇరువదియేడుపద్యములతో నేర్పఱిచిన క్షుద్రప్రబంధ విశేషము" అని తెలుస్తుంది. అది తెలియకుండా అభిజిత్తును పట్టుకుని అకాండతాండవంచేయడం 'అజ్ఞాన విలాసమేవ' అని అనిపించుకొంటుంది. క్షుద్ర ప్రబంధమంటే నీచమైన, తుచ్ఛమైన ప్రబంధమని అర్థంకాదు. లఘుకావ్యమని మాత్రమే అర్థం.

పింగళి సూరన కళాపూర్ణోదయము, తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము ముద్రిత గ్రంతాలలోని 'కొటేషన్లు' పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు పెట్టినవి కావు. వారి లేఖకులు పెట్టినవీ కావు. వావిళ్లవారు గాని, వారి పండితులుగాని, ముద్రాపకులు గాని పెట్టినవి. ఈ 'కొటేషన్' గుర్తులే కాదు; ఆధునిక విరామచిహ్నాలేవీ మన మనప్రాచీనమైన శిలాశాసనాల్లోగాని, తామ్రశాసనాల్లోగాని, తాళపత్ర గ్రంథాల్లోగాని లేవు. అంతేకాదు, ఉత్తరాది వారి భూర్జపత్ర గ్రంథాల్లోగాని, దక్షిణాదివారి కడితాలలోగాని ఉండవు. కారణం అవి ఇంగ్లీషు నుంచి దిగుమతి అయినవి. ముద్రణ వచ్చాక ముమ్మరమైనవి. ఇదీ 'కొటేషన్' గుర్తులు అసలు 'గొడవ'!

6-13-2, చిన వాల్తేరు, విశాఖపట్నం - 530 017

(సంస్కృతశ్లోకాలలో రెండవపాదం చివర ఒక చిన్న నిలువగీత(।) నాలుగవ పాదం చివర రెండు చిన్న నిలువుగీతలు (॥) మాత్రమే మనవి. ఇవి వాక్యవిరామ చిహ్నాలు కావు. పూర్వోత్తరార్ధ చిహ్నాలు.)

ఇంతకూ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి సుప్రసిద్ధమైన 'భరత ఖండంబు' అనే పద్యం, చెన్నాప్రెగడ భానుమూర్తి గారి అప్రసిద్ధమైన పద్యం అని కరణం సుబ్బారావుగారి వాదం.[1] కొందరు తెలుగు భూతభవిష్యద్వర్తమాన కాలాచార్యుల, మరికొందరు సంస్కృతాంధ్ర పరిశోధన పట్టభద్రుల అనువాదం.[2] అది చిలకమర్తి వారి పద్యమే అని సిబివిఆర్కె శర్మగారి ప్రతివాదం.[3] అయినా, అది చెన్నాప్రగడ వారిదే అని కరణం సుబ్బారావుగారి అతివాదం.[4] ఈ వాద, అనువాద, ప్రతివాద, అతివాదాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, పరామర్శించి అది చిలకమర్తి వారి పద్యమే అని రంగనాయకమ్మ గారి సిద్ధాంతం[5] అయినా సువిచారితం కాని రెండు అంశాలు వున్నాయి. అవి :

i. సుబ్బారావు గారి "కాకమ్మ కథ! థ్రాష్!!"

ii. "భరత ఖండంబు....", "దుడుకుందనమున' పద్యాల సంబంధం.

సుబ్బారావు గారి కాకమ్మ కథ! థ్రాష్!!

"1907లో వెలువడిన (భారతధర్మదర్శనము) అచ్చుప్రతిని ఎవ్వరూ చూడలేదు. చూడకుండానే భానుమూర్తి గారి గురించి "కాకమ్మకథ' లల్లారు. అట్లాంటి థ్రాష్ ఒకటి 'నవ్యాంధ్ర సాహిత్యవీథులు' ప్రథమభాగంలో రచయితలు చెప్పారు. 'భరతఖండంబు చక్కని పాడియావు' అనే చిలకమర్తి వారి పద్యభావానికి సమాధానముగా ఈ క్రింది పద్యం చెప్పినాడు. దుడుకుదనమున దీరదీ గడుసుదనము...(చూ.పే.113) అని ఓ కామెంట్ చేశారు."

1907లో ముద్రితమైన "భారతధర్మదర్శనము" అనే గ్రంథాన్ని ఎవ్వరూ చూడలేదా? ఏమి? ఆ గ్రంథం ముద్రితప్రతులన్నీ ముద్రించిన వేమవరపు రామదాసుగారి నేల మాళిగలో నీలుగుతూ మూలుగుతూ పడివున్నాయా?- ఇది'కాకమ్మ కథ' కాదా?

నవ్యాంధ్ర సాహిత్యవీధులు కాకమ్మకథల సంపుటి కాదు. నవ్యాంధ్ర సాహిత్యచరిత్ర. అభిప్రాయభేదాలు వుండవచ్చు. భ్రమప్రమాదాలు వుండవచ్చు. కాకమ్మ కథలు వుండవు. లేవు.

కురుగంటి సీతారమయ్యగారు నవ్యాంధ్ర సాహిత్యచరిత్రను 1827 మొదలు 1942 వరకూ వ్రాసి, ఆయనే ప్రథమతః 1942లోనే ప్రకటించారు. తదుపరి



1942-49 మధ్య నవ్యాంధ్ర సాహిత్య చరిత్రని అల్లుడు పిల్లలమర్రి వేంకట హనుమంతరావు గారితో కలిసి వ్రాసి, ప్రథమముద్రణంలో అలతి అలతి మార్పులు చేర్పులు చేసి నాలుగు భాగాలుగా 1949లోనే ప్రకటించారు. ఆ నాలుగు భాగాలూ కలిపి 1994లో తెలుగు విశ్వవిద్యాలయంవారు ఆచార్య కోవలె సుప్రసన్నాచార్యులు గారు సంపాదకులుగా ప్రకటించారు.

ఇంత విశిష్టమైన 'నవ్యాంధ్ర సాహిత్యవీధులు'లోని విషయం సుబ్బారావు గారికి 'కాకమ్మకథ'గా 'థ్రాష్'గా కనిపించడం విపరీతం.

కురుగంటి సీతారామయ్య గారు 1913 ప్రాంతంలో కట్టమంచి రామలింగారెడ్డి గారు ప్రచురించిన 'కవిత్వతత్త్వ విచారము' అనే అపూర్వమైన, అనర్ఘమైన నవ్యవిమర్శ గ్రంథాన్ని 'అలంకార తత్త్వవిచారము అనే ప్రతివిమర్శ గ్రంథాన్నివ్రాసి, అప్పుడే ప్రచురించిన అలంకారశాస్త్రవేత్త. తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయంలో తెలుగు పండితుడుగా ఉన్నప్పుడు "తంజాపురాంధ్రనాయకరాజుల చరిత్ర" అనే చరిత్ర గ్రంథంవ్రాసి ప్రకటించిన దేశచరిత్రకారుడు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉద్యోగంచేసినంతకాలం హైదరాబాదులో సురవరం ప్రతాపరెడ్డి ప్రభృతులకు ప్రతిద్వంద్విగా సాహిత్యచైతన్యం రేకెత్తించిన, ఆధునిక దృష్టికల సంస్కృతాంధ్ర సాహిత్యవేత్త. అంతేకాదు. ఆధునికాంగ్ల సాహిత్యవేత్తకూడా అని 1942 నాటి నవ్యాంధ్ర సామిత్యవీథులు చదివినవారికి కరతలామలకం.

పిల్లలమర్రి వేంకటహనుమంతరావు గారు గుంటూరు హిందూ కళాశాల తెలుగుశాఖ అధ్యాపకులు. అనేక సాహిత్యవిమర్శ గ్రంథాలు వెలయించిన సాహిత్యవేత్త.

భారతిలో చెన్నాప్రగడ గురించి వ్యాసం ప్రకటించిన మందలపర్తి ఉపేంద్రశర్మ గారు గుంటూరు హిందూ కళాశాల తెలుగుశాఖ అధ్యక్షులు. కళాశాల అధ్యక్షులు కూడా.

1942లో కురుగంటి సీతారామయ్య, ఎంఏ., ప్రొఫెసరు, నిజాంకాలేజి హైదరాబాదు (దక్కను) ప్రకటించిన విషయమిది.[6]

"ఇక భానుమూర్తి గారు విద్యార్థుల చిత్తాల్లో కలగజేసిన దేశ భక్త్యుద్రేకము చాలా గొప్పది. 'భారత ధర్మదర్శనం' మిక్కిలి ఉత్తేజకరము. హిందూదేశానికి స్వరాజ్యమొచ్చిందాకా దేశభక్తి కలిగించడానికి పనికొచ్చే పుస్తకం. అది వచ్చేదీ లేదు! దీన్లో సంగతులు పాతబడేదీలేదు! సాంఘిక, ఆర్థిక,రాజకీయ సమస్యలు

దానిలో చక్కగా రసవంతంగా ఉగ్గడించబడ్డె. 'ఒక నూటన్ పదికైన లేదు తినవయో తల్లి ముప్రొద్దులన్'., 'ఆపద్ధర్మము బండలే శ్రుతులుc దద్వాప్పూర్వకాలంబ దేశాపత్కాలము కంటె నొందుగలదే' 'ఇది యార్యశ్రేష్ఠధర్మంబొకో!' అనే భాగాల తార్కాణాలు. 'భరతఖండంబుచక్కని పాడియావు' అనే చిలకమర్తి వారి పద్యభావాని సమాధానంగా యీ క్రింది పద్యం చెప్పాడు. చూడండి:-

"దురుసుదనమునదీరదీ గడుసుదనము
గాన తాపులు పోటులు కార్యమనకి
లేగలన్నిటి నేకమౌలాగొనర్చి
నేర్పుతో తల్లి యెగజేపనేరవలయు."

1907-08 సంవత్సరంలోకి సహాయనిరాకారణాన్ని యీ పద్యమూలంగ నిరూపించిన మహామహుడీయన. ఆయన భారతమాతను గూర్చి రాసిన మాలికాస్తవ సారస్వతంలోనే "పూతమెరుంగులున్" వలె శాశ్వతంగా వుండవలసినంత గొప్పది

ఓ.వై.శ్రీ. దొరస్వామయ్యగారి ఆనందమఠ మీ కాలానిదే. అందులో వందేమాతరగీతం.

"శరదభి రామచంద్రికలు చారువసంత సుమోత్కరంబులున్
..... ..... .....
ధరపయి స్వర్గసౌఖ్యములు తల్లిరా! నీ ప్రజకెల్లకాలమున్"
"మతముల సొచ్చినిల్లు.... నీ సరిధన్యులుందురే?"

ఇందులో లేనివి 1949 నాటి ప్రచురణంలో ఉన్నవి :-

1. భానుమూర్తి గారి కాలం (1868-1945).
2. "ఉపేంద్రశర్మ గారి వ్యాసము : (భారతి, సెప్టెంబరు 1945).

భానుమూర్తి గారి కృతులు: జయదేవపద్మావతుల చరితము, ఒ మహాపురుషుని చరితము, బాలచంద్ర చరితము, పరమార్థ తత్వసారమ సత్యహరిశ్చంద్ర చరితము, దేవయానికథ, ప్రియదర్శిక (తెనుగుసేత), వదాన్యు చరితము మొదలైనవి".

ఇందులో (1942) ఉన్నవి 1949 నాటి ప్రచురణలో లేనివి.

"హిందూ దేశానికి స్వరాజ్యమొచ్చిందాకా దేశభక్తి కలిగించడానికి పనికొ పుస్తకం. అది వచ్చేదీ లేదు. దీన్లో సంగతులు పాతబడేదీ లేదు."

ఇవి 1842 నాటి వ్రాతలు. కాని 1947లో భారతదేశానికి స్వాతంత్ర్య వచ్చిందికదా! అందుకే తీసేశారు. ఇందులోని చిలకమర్తి వారి పద్య



'భరతఖండంబు' కాకమ్మ కథ అయితే, చెన్నాప్రగడ వారి 'ఒక నూటన్ పదికైన', 'ఆపద్ధర్మములు' 'ఇది యార్యశ్రేష్ఠ' - అనే పద్యాలూ, మాలికాస్తవం, అని కల భారత ధర్మదర్శనం కాకమ్మ కథలు కావా? భారతధర్మదర్శనం ముద్రిత గ్రంథం చూడకుండానే కురుగంటివారు అందులోని పద్యాలు 1942లోనే ఉదాహరించారా?-

"1907లో వెలువడిన (భారత ధర్మదర్శనము) అచ్చుప్రతిని ఎవ్వరూ చూడలేదు" అని సుబ్బారావు గారు చేసినవాదమే 'కాకమ్మకథ, ట్రాష్' కదా!

పైది కురుగంటి సీతారామయ్యగారు 1942లో ప్రకటించింది. 1945 వరకూ చెన్నాప్రగడ భానుమూర్తి గారుసజీవులు! కురుగంటి వారి నవ్యాంధ్ర సాహిత్యవీథులు (1942) గురించి వినలేదా. కనలేదా? చదువుకొనలేదా? తన "భరతఖండంబు" పద్యం చిలకమర్తివారి దన్నందుకు కురుగంటి వారిని పత్రికాముఖంగా ప్రశ్నించవచ్చును గదా! పరువునష్టందావా కూడా వేయవచ్చును గదా! ప్రశ్నించలేదేమి! దావావేయలేదేమి?

ఇది చెన్నాప్రగడవారు సజీవులై ఉండగానే కాదు; చిలకమర్తి వారు స్వీయచరిత్రము వ్రాయకముందే, విశాలాంధ్ర ప్రచురించకముందే కురుగంటివారు ప్రకటించిన విషయం. ఇది గమనార్హమైన విశేషం.

కురుగంటివారి నవ్యాంధ్రసాహిత్య వీథులకు (1942) పూర్వమే. 1935లోనే జయంతిరామయ్య పంతులుగారి 'ఆధునికాంధ్ర వాఙ్మయ వికాసవైఖరి' అనే ఆధునిక సాహిత్యచరిత్ర గ్రంథమొకటి ప్రకటింపబడింది. అందులో చెన్నాప్రగడ భానుమూర్తి గారి ప్రసక్తి లేదు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి బహు విషయములు సోదాహరణ నిరూపణాత్మకంగా వున్నాయి.

జయంతి రామయ్యపంతులుగారు సుప్రసిద్ధులు. ఆంధ్ర సాహిత్య పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికావ్యవస్థాపక సంపాదకులు. పండిత సాహాయ్యంతో సూర్యరాయాంధ్ర నిఘంటువు ప్రథమ, ద్వితీయ, తృతీయ సంపుటాలు సంఘటించిన నిఘంటుకారుడు. విద్యార్హత బి.ఏ.,బి.యల్ అయినా, మహావిద్వాంసులు. డిప్యూటీ కలెక్టరు. అయినా **కలెక్టరు రామయ్యగారు**' అని వ్యవహారప్రసిద్ధులు. గ్రాంథికభాషావాది. అయినా వ్యవహారిక భాషావాది గిడుగు రామ్మూర్తిపంతులుగారు 'జయంతి రామయ్యపంతులుగార్ని ఒప్పించలేకపోయా'నని బాధపడ్డారుగాని నిందించలేదు. వావిళ్ల వారు ప్రకటించిన 'శ్రీనాథుని వీథి'లోని **అశ్లీల** విషయాలు సుశీల విశేషాలని న్యాయస్థానంలో పండితప్రకాండులు వాదిస్తే న్యాయమూర్తి అడిగితే, అవి అశ్లీలవిషయాలే అని చెప్పిన ఋజుశీలి జయంతి

రామయ్యపంతులు గారు! అటువంటి జయంతి రామయ్యపంతులుగా(
అభిప్రాయమిది[7].

"చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిటీవల భాసనాటకములను ప్రతీతి
వెలువడిన పదునొకండు చిన్ని నాటకములు తెనిగించిరి. వీరి రచ
వీరేశలింగముగారి రచనకంటె నించుక పలుచనయి సుప్రసన్నమున
మూలగ్రంథాపేక్షయేమాత్రము లేకయే భావము సువ్యక్తము చేయునది..."

"రంగస్థలమునఁబ్రదర్శించుటలో చిలకమర్తి లక్ష్మీనరసింహకవి కృ
గయోపాఖ్యాన మధికమనితోఁచుచున్నది. నేఁటివఱకు దీనిప్రతులు లక్షదా
లమ్ముడుపడినట్లు వినుచున్నాము. ఆంధ్రుల కితరనాటకముల కంటె
నాటకమందధికాదరమున్నట్లు కనఁబడుచున్నది.

"జనామోదమునుబట్టి నాటకరాజమని చెప్పఁదగిన యీ నాటకమున
గుఱించి యించుక విపులముగా విమర్శించుట సమంజసము..."

"చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన ప్రహసనముల లెనుబ
మూఁడు ప్రకటింపఁబడినవి.... వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది
లక్ష్మీనరసింహము గారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యమ
గిలిగింతలు పెట్టి నవ్వించును. వీరేశలింగముగారి హాస్యము గిల్లి బాధించును"

"చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు కూడ రెండు సంపుటములకు సరిపడ
కథలు రచించినారు. వీరి కథలలో భారత, భాగవత గ్రంథములలోని విషయముల
గతించిన కథలనేకములున్నవి. వాని తర్వాత రాజస్తాన కథావళి ముఖ్యము. ఇంద
కథలు. "Tod's Annals of Rajasthan" అను గ్రంథమునుండి గ్రహింపఁబడిన
"రఘుకులచరిత్ర" మను పేరుతో కాళిదాసకృతరఘువంశము నీయన తెలిగించెను"

"చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును బెక్కు నవలలు రచించిరి.... వీ
నవలలోని కథలు కొన్ని చరిత్రాత్మకములును గొన్ని కేవల కల్పితములును. చరిత్రాత్మ
కథలలో కర్పూరమంజరి ముఖ్యమైనది. కల్పితకథలలో గణపతి యుత్తమమ
నాయభిప్రాయము. లక్ష్మీనరసింహముగారు హాస్యరసప్రియులు. కావున నాయ
గ్రంథములందవకాశమున్న యెడలనెల్ల నా రసము పొడకట్టుచుండును. వీరి హాస్యమ
మొత్తము మీద మృదువును హృద్యమును నయి యుండును".

ఇందులో లేనివి, కురుగంటి సీతారామయ్యగారి నవ్యాంధ్ర సాహి
వీథులలో (1942) ఉన్నవి మరికొన్ని విశేషాలు:[8]



"ఈ సంస్కర్తల్లో యింగ్లీషు పండితులుగాక యిప్పుడు జీవించివున్న మహామహుల్లో కొందరాంధ్ర భాషాభిమానులున్నారు. వీరిలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారొకరు.... 'అహల్యాబాయి' 'సౌందర్యతిలక' 'రామచంద్ర విజయం' మొదలైన చక్కని నవలలు రచించారు... ఇదిగాక యీయన మొదటి ఆంధ్రనాటక రచయితల్లో కూడా వకరు. "ప్రసన్నయాదవ, ప్రచండయాదవ, పారిజాతపహరణిలు స్వతంత్ర నాటికలు... బందరులో 'రామమోహన థియేట్రికల్ కంపెనీ' వారు తప్పక నరకాసురవధను నరకచతుర్దశినాడు ఆడేవాళ్లు... సామాన్యంగా ప్రతి విద్యార్థి యితరులూ కూడా యీ నాటకాల్లో నించీ కొన్ని పద్యాలైనా కంఠతాపెట్టేవారు. 'అల్లుడా రమ్మని' సామాన్యంగా అందరి నోళ్లల్లోనూ వుండేది!.... ఇప్పటికీ 'గయోపాఖ్యానం' అక్కడక్కడా ప్రదర్శింపబడుతూనే వుంటుంది.......

ఈయన సీసపద్యాలు శ్రీనాథునివాటిల్లే చాలావరకూ సమతరసవంతంగా వుంటై! ఒకొక్కక్కచోట చక్కని ప్రబంధకవిత పోకడలు కనబడుతూ వుంటై! వీరేశలింగంగారిశైలల్లే యీయనది కూడా సౌలభ్యంతో కూడి వుంటుంది. 'ఉలూయశతక' పరివర్తనం చక్కనిపాకంలో వుంది. 'ఉద్గ్రంథ రచయితల్లో చేర్చదగినవాడు.....

ఈయన గొప్ప వక్త. పట్టుకొని తీసుకెళ్లి వేదిక యెక్కిస్తే అనర్గళధారలో గంగాలహరల్లే యీయన వాణి విజృంభించి శ్రోతలకు కర్ణపేయం చేస్తుంది ఈయన గద్యపద్యశైలీ కూడా గంగాలహరల్లే అనర్గళం...."

**ఇంతటి కవి చిలకమర్తి! ఎంతటి కవి చెన్నాప్రగడ?**

పద్యకావ్యాలు7, ఖండకావ్యాలు13, నాటకాలు3 (వీనిలో ఒకటి చిలకమర్తివారి హేమలత నవలకు నాటకరూపమే) రూపము1 (నాటకం కంటె భిన్నమైనది కాబోలు!) వ్యాసం1. మొత్తం పాతిక. వీనిలో బాలచంద్ర చరిత్రము మాత్రం ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు సంబంధించిన ఇంటర్మీడియట్ విద్యార్థులకు 1946 - 48, 1947-49, 1948-50 విద్యా సంవత్సరాల్లో నవ్యకవిత్వంగా పాఠ్యగ్రంథమయింది. అదే ఇతివృత్తంలో ఏటుకూరి వేంకట నరసయ్యగారి 'మగువ మాంచాల' ఖండకావ్యం సుప్రసిద్ధం. అది 'కావ్యం యశస్తే' ఇది 'కావ్యం అర్థకృతే'.

ఇంతకూ చిలకమర్తివారి 'భరతఖండంబు' అనే పద్యం చెన్నాప్రగడ వారి 'భారతీయధర్మాదర్శ నక్షత్రమాల' అనే కావ్యఖండికలో ఆదిని 'కొటేషన్స్'లో వుంది. 'నక్షత్రమాల' అనే అలంకారశాస్త్ర పరిభాషాపదానికి ఇరవైయేడు పద్యాల క్షుద్ర ప్రబంధ విశేషమని అలంకారశాస్త్ర ప్రోక్తం అని పూర్వోక్తం. ఈ పద్యంకాక, ఈ కావ్యఖండికలో ఇరవైయేడు పద్యాలు వున్నాయి కాబట్టే, ఈ పద్యం 'కొటేషన్సు'లో

కూడా వుంది కాబట్టే 'భారతీయధర్మాదర్శనక్షత్రమాల' లోనిది కాదనీ, అం
చెన్నాప్రగడ వారి పద్యం కాదనీ, చిలకమర్తివారి పద్యమే అనీ స్థితిస్థాపకం. అంతేకాద
ఈ పద్యానికి ముందు వ్రాతప్రతిలో 'క॥'అనీ, తరువాతి ఇరవైయారు పద్యాల
ముందు 'గ॥'అని, ఇరవైయేడో పద్యానికి ముందు 'క॥' అనీ వున్నాయి. 'కం॥
అంటే కందపద్యం. అది కందపద్యమే. 'గీ' గీతపద్యం. తేటగీతి పద్యం. ఇరవైయార
పద్యాలూ గీత పద్యాలే. అంటే తేటగీతి పద్యాలే. 'క॥' అంటే కవిరాజ విరాజి
పద్యం అవుతుంది. కాని, 'క॥' ముందున్న చిలకమర్తివారి పద్యం కవిరాజవిరాజిత
కాదు. తేటగీతి పద్యమే! కాని 'గీ॥' అని లేదు. 'క॥' అనే వుంది. అది పద్యనామ
సంకేతంకాక మరొకటి కావచ్చునేమో అని అయోజించక 'గీ' అని ముద్రితప్రతిల
దిద్దివేయడం 'ఆహా! మూలచ్ఛేదే తవ పాణ్డిత్యప్రకర్షః' అని అనిపిస్తుంది. అంతేకాదు
'స్థితిస్యగతిశ్చిన్తనీయా' అని మన సంప్రదాయవచనం. అందుకు సిబివిఆర్కె శర
గారి ప్రయత్నమిది.[9]

“నియం కావచ్చు. కాకపోవచ్చు. ఇది నా ఊహామాత్రమే!.... 'కలుపబడినద
అను నిగూఢభావనకి సంకేతపదంగా 'క' అను అక్షరాన్ని వాడి శ్రీ చెన్నాప్రగడవార
తమ సంస్కారాన్ని ప్రదర్శించుకొన్నారని మన మనుకూల దృక్పథంతో Atitud
Positive ఎందుకు భావించకూడదు?...”

“ఇది నా ఊహామాత్రమే' అని శర్మగారే అన్నారు. అది ఉత్తమ సంస్కారాని
నిదర్శనం. ఇంతకంటె 'క॥' అంటే కవిరాజరాజితమే కావచ్చును. అర్థతః
'భరతఖండంబు' అనే పద్యం తెల్లదొరల రక్షకభటశాఖవారి దృష్టికి వెళ్లినట్ల
చిలకమర్తివారి స్వీయచరిత్రలో (1944) వుంది. ఆ పద్యం చిలకమర్తి వారిద
పేర్కొంటే 1907 ప్రాంతంలో ప్రమాదకరం. పేర్కొనకపోతే కృతఘ్నత అవుతుంది
అందువల్ల కవిరాజవిరాజితం అంటే కవిరాజైన చిలకమర్తివారి చేత బిపిన్‌చంద్రపా
సభలో ప్రకాశించిన పద్యం అనే అర్థాంతరంతో కృతజ్ఞత అవుతుంది. కాబట్టి 'క॥
అంటే కవిరాజవిరాజితమే కావచ్చు. ఇది సంభావ్యమైన సమన్వయం.

చెన్నాప్రగడ వారి నక్షత్రమాల ఇరవైయేడు పద్యాలూ వాచ్యార్థపరిమితాలు
చిలకమర్తివారి భరతఖండంబు' అనే పద్యం వ్యంగ్యార్థ విలసితం.

“భరతఖండంబు చక్కని పాడియావు
మిందువులు లేఁగ దూడలై యేడ్చుచుండఁ
దెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియఁగట్టి.”



ఇందులో గడుసువారైన గొల్లవారు తెల్లవారగానే లేగదూడలు గోల పెడుతుంటే. వాటి మూతులు గట్టిగా కట్టేసి, మంచి పాడావుపాలు పితికేస్తున్నారనేది ఉపమానం. గడుసువారైన తెల్లదొరలు హిందూ దేశస్థులు గోల పెడుతుంటే, వాళ్ల నోళ్లు నొక్కేసి భారతదేశం సంపదలు కొల్లగొట్టుకు పోతున్నారనేది ఉపమేయం. ఇది వాచ్యార్థం. ఈ పద్యానికి సందర్భం రాజమండ్రిలోని బిపిన్ చంద్రపాలే ఉద్రేకపూరితమైన నాలుగు రోజుల ఉపన్యాసాలు. ఆ ఉపన్యాసాల సారాంశం హిందూదేశస్థులంతా ఏకమై, తిరుగుబాటు ఉద్యమం లేవదీసి, తెల్లదొరల్ని మనదేశం నుంచి తరిమివెయ్యాలన్న అతివాదం. ఇది చిలకమర్తివారి పద్యంలోని ప్రతీయమానార్థం. అంటే వ్యంగ్యార్థం. ఈ అతివాదం 1907లోనే (ఏప్రిల్ నెలలో) బిపిన్‌చంద్రపాల్ ఉద్రేకపూరితమైన, ఉద్వేగభరితమైన ఉపన్యాసాల ద్వారానే ఆంధ్రావనిలో అడుగుపెట్టింది. దీనికి వ్యతిరేకమైనది 1885 నుంచీ వున్న మితవాదమే. అతివాదమే కర్తవ్యమని చిలకమర్తివారి ఆశయం. అంతేకాదు. అదే సరియైనదని చిలకమర్తివారి కరపత్రం. కాబట్టి 'క' అంటే కర్తవ్యంగాని, కరపత్రం గాని కావచ్చు. కతపత్ర మంటే ప్రమాణపత్రం. తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యంలో ప్రయోగం వుంది.

“కతపత్ర మిడవచ్చుఁగలఁగాంచునపుడైన
గోరికఁబరకాంతఁగోరఁడనుచు” 68.1 అ.

చెన్నాప్రగడ వారి భారతధర్మాదర్శ నక్షత్రమాల ఇరవైయేడు పద్యాలలోని అంశాలు మితవాదధోరణులు.

“దుడుకుఁదనమునఁదీగడుసుఁదనము
గాన తాపులు పోటులు కార్యమనక
కతలన్నిటి నేకమౌలాఁగొనర్చి
నేర్పుతోఁదల్లి యెగఁజేపనేరవలయు.”

ఈ గడుసుదనం అంటే ఏ గడుసుదనం?

తెల్లదొరల గడుసుదనం. అది దుడుకుతనం వల్ల అంటే అతివాదం వల్ల పోదని భారదీయులంతా ఏకమయ్యేటట్లు చెయ్యాలని, భారతదేశం ఎగజేపడం (ఎగ్గొట్టడం) నేర్చుకోవాలి అని ఈ పద్యానికి వాచ్యార్థం. ఇందులో వ్యంగ్యార్థం లేదు. ఇందులోనే కాదు. ఈ పద్యం మొదలు 'వందేమాతరమను' పద్యం వరకూ భారతధర్మాదర్శ నక్షత్రమాల ఇరవైయేడు పద్యాల్లోనూ వ్యంగ్యార్థం లేదు. అంతా వాచ్యార్థమే.

ఆవు ఎగజేపడం అరుదైన విషయం. ఎగజేపడం అంటే దూడకి సైత పాలు స్రవించకుండా బిగబెట్టడం. ఇది ఆవుపాలు పితికే అలవాటున్నవారికి బాగ తెలుస్తుంది. అది దేశపరంగా అంత సుసంగతం కాదు.

చెన్నాప్రగడ వారి నక్షత్రమాల ఇరవైయేడు పద్యాల్లోనూ వున్నది మితవాదమే అతివాదం కాదు. విదేశీవస్త్ర బహిష్కారం, దేశాభిమానం, ఐకమత్యం, సౌభ్రాతృత్వం మతసామరస్యం మొదలైనవి అతివాదభావాలు కావు, మితవాదభావాలు. ఇవి 188 తర్వాత నుంచీ సంఘసంస్కర్త, నవ్యసాహిత్య యుగకర్త కందుకూరి వీరేశలింగంగా పత్రిక వ్యాసాల్లోనూ, లిఖితోపన్యాసాల్లోనూ ఉన్నవే. 1907 నాటి అతివాదం అత పూర్వం లేనిది. ఈ అతివాదఖండనమే చెన్నాప్రగడ వారి ఆశయం. అందుక చిలకమర్తి వారి 'భరతఖండంబు' పద్యం ఆలంబనయష్టి.

'భారతీయ ధర్మాదర్శనక్షత్రమాల' ముందు ఉదాహృతమైన చిలకమర్తి వా 'భరతఖండంబు' అనే పద్యానికి, ఉపక్రమణమైన చెన్నాప్రగడ వారి 'దుడుకు దనమున' అనే పద్యానికీ 'పరస్పర సంబంధం' లేదు. అనుబంధం కాదు. ప్రతిబంధం అది చారిత్రక నైపథ్యం మీద ప్రకాశిస్తుంది. ఇది గమనార్హమైన విశేషం.

1. ఈ పద్యాన్ని వ్రాసిందెవరు? పుటలు 1-20
2. పైది. పుటలు 0 XXVII
3. ముద్రిత వ్యాసపత్రావళి. పుటలు 1-18
4. లిఖిత వ్యాసపత్రావళి. పుటలు 1-10
5. ఈ '....చక్కని పాడియావు' ఎవరిది? పుటలు 3-56.
6. నవ్యాంధ్ర సాహిత్యవీథులు. 1942. పుటలు 92-94
7. ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి. 1935. పుటలు 47-48 59-768; 81-87; 94,23-25
8. ఆరు వలె. పుటలో 41-43
9. మూడు వలె. పుట 16

("నడుస్తున్న చరిత్ర"లో ప్రచురితం)

# "భరతఖండంబు ..." చిలకమర్తి వారిదే...

**సి.బి.వి.ఆర్.కె. శర్మ** ఎమ్.ఎ.,
రాష్ట్రపతి పురస్కార గ్రహీత, భాషా ప్రవీణ

"భరత ఖండంబు చక్కని పాడియావు..." అను పద్యం శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారిది కాదు – శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి గారిది అను తమ వాదానికి అక్షర రూపాన్నిస్తూ శ్రీ కరణం సుబ్బారావు ఒక చిన్న గ్రంథాన్ని ప్రచురించారు. సత్యశోధకులుగా, సాహితీ సర్వ సైన్యాధ్యక్షులుగా ఒక సాహిత్యరణానికి శ్రీ కరణం వారు నగారా మ్రోగించారు. మరికొందరు సాహితీ ప్రియసైన్యాధికారులు శ్రీ కరణం వారికి అండగా నిల్చారు! చాలా సంతోషం! శ్రీ కరణం వారి ఈ రణరంగంలో నేను ప్రతియోధునిగా నిల్చి, నాకున్న పరిమిత సాహితీ జ్ఞాన సేనానివహంతో ఎదుటివాదాన్ని నిరస్తం చేయాలనే ఉబలాటంతో ఈ వ్యాసం వ్రాస్తున్నాను. ఆ పద్యాన్ని శ్రీ చిలకమర్తి వారే వ్రాశారు అన్నది నాయీ వ్యాస సారంంశం. శీర్షిక కూడా అదే గదా!

శ్రీ సుబ్బారావు గారి సహయోధులు ఒక్కొక్కరు ఎవరేమన్నారో ముందుగా ఒకసారి పరిశీలిద్దాం! ఉస్మానియా విశ్వవిద్యాలయం మహిళా కళాశాలలో తెలుగు శాఖాధ్యక్షులు, పరిశోధన పర్యవేక్షకులు, అయిన డా॥ యస్వీ. సత్యనారాయణ గారు "వందేళ్లన తరువాతైనా.."అను తమ వ్యాసంలో..." పదుగురాడు మాట పాడియై ధర చెల్లు" అన్నట్లుగా ఇన్నాళ్ళూ ఒక అబద్ధం పదేపదే ప్రచారం చేయబడుతూ వచ్చింది. శ్రీ సుబ్బారావు గారి 'డ్రాఫ్ట్ ప్రతి' చదవగానే 1943లో అచ్చుయిన శ్రీ చిలకమర్తి జీవిత చరిత్రను (అది 1944లో 30/12/1944న ఆవిష్కరింపనబడింది. 1943లో కాదు). మరోసారి తిరగేశాను..." అంటూ అందులోని "... నా మనసులో ఊహించుకొని..." అను ఘట్టమునాధారముగా చూపారు.

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ప్రొఫెసర్, తెలుగు శాఖాధ్యక్షులు, పరిశోధక పర్యవేక్షకులు డా॥ మన్నవ సత్యనారాయణ గారు "సత్యశోధ నకు సాధువాదాలు.." అను తమ వ్యాసంలో "... గత శతాబ్ది కాలం నుండి ఈ పద్యం శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి రచనగా చెలామణి అవుతూ వస్తోంది. ఐతే శ్రీ కరణం సుబ్బారావు గారు పై పద్యం చిలకమర్తి వారిది కాదని, అది

23-19-13/1, సుబ్రహ్మణ్యగుడి ప్రక్కన, కోరుకొండ రోడ్,
హరిపురం, రాజమహేంద్రి - 533 105.

శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి గారిదని తమ గ్రంథంలో నిరూపించారు.." అంటూ ప్రశంసించారు.

ఆంధ్రాంగ్ల సంస్కృత రష్యన్ భాషలలో దిట్ట, ప్రభుత్వ డిగ్రీ కళాశాల్లో ప్రిన్సిపాల్‌గా పనిచేసి రిటైరైన శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు గారు "ఆప్తమిత్రుని అమూల్య పరిశోధన" అన్న తమ వ్యాసంలో "... ఈ పద్యాన్ని వ్రాసిందెవరు? చిలకమర్తి వారా? చెన్నాప్రగడ వారా? సుబ్బారావు ఈ శంక తెలియజేసిందాకా నాకు తట్టనేలేదు...", "... ఈ విషయం గుఱించి తర్కించేమార్గంలో సుబ్బారావు ప్రయత్నం చేస్తున్నాడు! ఇప్పుడు మనం చేయవలసింది సత్యాసత్యాలు తేల్చడమే!..." అంటూ పరిష్కారాన్ని పాఠకునికే జాగ్రత్తగా వదిలివేశారు.

భాషా ప్రవీణ, భాషా కోవిద, ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి., (సంస్కృ); ఎం.ఏ., పిహెచ్.డి., (తెలుగు), పిహెచ్.డి., (తెలుగు) లను డిగ్రీలుగా పొంది, పరిశోధన పర్యవేక్షకులుగా వ్యవహరిస్తున్న డా॥ వుయ్యూరు లక్ష్మీ నరసింహారావు గారు "సత్యే సర్వం ప్రతిష్ఠితమ్" అను తమ వ్యాసంలో "... ఆ పద్యాన్ని చిలకమర్తి వారిదిగా ఉదహరించడం చదివి, ఇప్పటి వఱకు ఎన్నో సభలలో దీనిని వారిదిగానే గానం చేశాను. కాని శ్రీ కరణం సుబ్బారావు గారు పరిపరివిధాల పరిశీలించి వ్రాసిన ఈ పుస్తకాన్ని దీనిలో అనుబంధంగా చేర్చిన 1907 నాటి చెన్నాప్రగడ వారి 'భారతధర్మ ధర్మనం' కావ్యాన్ని చదివి ఈ పద్యకర్త శ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తి గారని తెలిసి విస్తుపోయాను..." అంటూ ఒక విచిత్రమైన ప్రతిపాదన చేశారు. "...ఈ "భరతఖండంబు" పద్యం శ్రీ చెన్నాప్రెగడ వారిదని మనవి చేసి ఉదహరించాలి. ముఖ్యంగా విశ్వవిద్యాలయాలవారు. మీడియా వారు ఈ పరిశోధ తాంశాన్ని తమ పరిధిలో ప్రచారం చెయ్యాలి. ఇంకా పద్యం చిలకమర్తి వారిదే అని భావించే వారుంటే వారు ముందుగా అందుకు ఆధారాలు చూపాలి..." ఇది ఆయన గారి ప్రతిపాదన! ఈ వ్యాసం అంతా చదివిన తరువాత ఏం చేయాలనుకుంటారో విజ్ఞులు శ్రీ వుయ్యూరు వారికే వదిలేస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పూర్వ సభ్యులు, రాజమండ్రిలోని సాహిత్య గౌతమీ, విశ్వవిజ్ఞాన పరిషత్ సంస్థలకు అధ్యక్షులు, ప్రముఖ న్యాయవాది, సీనియర్ జర్నలిస్ట్ శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి గారు "సాహిత్యాభిమానులందఱూ కైమోడ్పులు చేయాలి" అన్న తమ వ్యాసంలో "... అప్పటికే ఆంధ్రప్రదేశ్ అంతటా బహుళ వ్యాప్తిలో ఉన్న భరతఖండంబు చక్కని పాడియావు' అన్న పద్యం చిలకమర్తి వారిదేనన్న' అపవాదును మేము అంతగా పట్టించుకోలేదు.....", "... కేవలం ఒక సాహిత్యవేత్తకు ఇన్నేళ్ళు దేశవ్యాప్తంగా జరిగిన అపచారాన్ని అపచయించి సాహిత్య సత్యాన్ని నెలకొల్పి తమ పరిశోధన సార్థకతను నిలుపుకొన్న శ్రీ సుబ్బారావు గారికి సాహిత్యాభిమానులందఱూ కైమోడ్పులు చేయాలి..." అంటూ అభినందించారు.



ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అసోసియేట్ ప్రొఫెసర్, పరిశోధన పర్యవేక్షకులు అయన డా॥ వెలుదండ నిత్యానందరావుగారు "అన్నా! చెన్నాప్రగడ భానుమూర్తి!" అంటూ సానుభూతితో కూడిన తమ వ్యాసంలో శ్రీ చిలకమర్తి మఱియు శ్రీ చెన్నాప్రెగడ గారల చిన్ననాటి స్నేహాన్ని వర్ణిస్తూ "...చిలకమర్తికి తొలిదినాల్లో కొంత స్ఫూర్తి కలిగించడంలో ఆశ్చర్యపోవలసింది ఏమీలేదు. చెన్నాప్రగడవారు భరతఖండంబు మొదలైన పద్యాలు రచిస్తున్నపుడు చిలకమర్తి వారు తొలి శ్రోత కావడంలో కూడా అసహజం ఏమీలేదు.." అంటూ ఒక కొత్త ఊహాగానం చేశారు! (ఇందుకు నిర్దుష్టమైన వ్రాతపూర్వక ఆధారం లేదు! ఇది ఒక ఊహాగానమే! శ్రీ నిత్యానందరావు గారు మనసులో ఊహించుకొన్నదిది). శ్రీ నిత్యానందరావు గారే "... బుద్ధి పూర్వకముగా నేనేమియు నసత్యములు వ్రాయలేదు' అంటూ సత్యనిష్ఠనుపాటిస్తూనట్లు లేదు..." (అంటూ – అర్థతలేని తన కొస్తున్న కీర్తి ప్రతిష్ఠలను తాను అట్టిపెట్టుకోవాలని శ్రీ చిలకమర్తి సంకుచింగా ఆలోచించారు – అని తేల్చారు!) శ్రీ నిత్యానందరావుగారే 'భరతఖండంబు' పద్యాన్ని దానివెంటనే ఉన్న 'దుడుకుదనమున దీరదీగడుసుదనము...' అను పద్యాన్ని రెండింటిని ఉదహరించి" ... ఈ రెండు పరస్పర సంబంధమున్న పద్యాలు. బిపిన్ చంద్రపాలుని సభలో చిలకమర్తివారు మనస్సులో ఊహించుకొని 'భరతఖండంబు' పద్యాల్ని చదివారు..." అని శ్రీ యస్వీ. సత్యనారాయణ గారి భావాన్ని పునరుద్ఘాటించారు. (పరస్పర సంబంధాలు – నిజమే! ఏకశైలీ, ఏకశయ్యా సముపేతాలా?? చూద్దాం! తరువాత విశ్లేషిస్తాను) ఇంక శ్రీ నిత్యానందరావు గారు 'భరతఖండము' పద్యంలోని భావం 1905 డిసెంబరు 15 నాటి కృష్ణాపత్రికలో 'ది–క్రై ఆఫ్ మదర్ ఇండియా' అను శీర్షికతో వెలువడిన అజ్ఞాత కర్తృత్వమైన ఆంగ్లగీతంలో ఉంది అంటూ ఒక ప్రతిపాదనను ముందుకు తెచ్చారు! (ఇదే పుస్తకం 6వ పేజీలో శ్రీ కరణంవారు ఈ భావంతో విభేధించి – అసలు ఆ పద్యమే ఆ ఆంగ్లగీతానికి మూలం అంటూ తీర్మానించారు.)

ప్రకాశం జిల్లా వేటపాలెంలోని బి.బి.హెచ్., డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ గారైన డా॥ సత్రం మల్లేశ్వరరావు గారు" పరిణితి చెందిన పరిశోధకులు శ్రీకరణం సుబ్బారావుగారు" అను తమ వ్యాసంలో "... ఆ తప్పిదమేమిటంటే 'భరకఖండంబు' అనే పద్యం చిలకరమర్తి గారు వ్రాసిందని ప్రచారం చేయడం. సుబ్బారావు గారు ఈ గ్రంథంలో ఆ తప్పిదాన్ని ఖండించి... చెన్నాప్రగడ భానుమూర్తిగారు... రచించారని వెలుగులోనికి తెచ్చి అందరి కళ్ళు తెరిపించారు....' అంటూ అభినందించారు.

అధ్యాపకులు, యువకవి, రచయిత అయిన శ్రీ పి. శ్రీనివాస గౌడ్‌గారు "సత్యం ముందు ఎవరైనా తలవంచాల్సిందే" అను తమ వ్యాసంలో "...ఇటువంటి సత్యశోధన పరిశోధనని ఆహ్వానించ మొండిగా తిరస్కరిస్తే తెలుగు సాహిత్య చరిత్రకు ద్రోహం చేసిన వారమవుతాం.." అంటూ శాపం కూడా పెట్టారు.

ఇందఱు అభిప్రాయాలు ఒక ఎత్తైతే "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయ పరిశోధనా సంస్థకు డైరెక్టర్, ప్రముఖ కవి, రచయిత, ప్రొఫెసర్ అయిన శ్రీ జయధీర్ తిరుమల రావు గారు "ఒక ధర్మాగ్రహ పరిశోధన"అను శీర్షికగల తమ వ్యాసంలో వ్రాసిన వ్రాతలు మఱోఎత్తు! వారు సాయించిన శ్రీసూక్తులు తిలకించండి!

1) "... 'భరతఖండంబు' పద్యం అసలు రచయితకు ఇంతకాలంగా జరిగిన అన్యాయం ఏ కవికి పట్టకూడదు! వైట్ కాలర్ నేరాలను, సైబర్ మోసాలను గుర్తించవచ్చు! కాని ఇంతటి సాహిత్య సమస్యను ఎవరు అడ్డుకోగలరు? కొంతమంది చేతిలో ఉన్న సాహిత్య వ్యవస్థ కూడా వారితో కుమ్మక్కైతే ఇక అడ్డుంటుందా? ఉండదు! ఆధిపత్యవర్గం, కులం, పురుషాధిక్య సాహిత్య విగ్రహతత్వం అన్నీ కలిపి ఎన్నో ద్రోహాలు చేశాయి! (సాహిత్య వ్యవస్థ కొంత మంది చేతులో లేదు! పత్రికల్లోని ఆ పేజీ వ్యవస్థ కొంతమంది' అర్ధజ్ఞాన ప్రవీణుల చేతుల్లో ఉంది! అది గమనించ ప్రార్థన.)

2. "... మొదటికథ ఓ విగ్రహానికే అంటగడతాం..., బహుశ ఆమె ఒక స్త్రీకావడం వల్లె ఆమె తొలి కథకురాలిగా కాలేకపోయింది..."

3. '... మొదటి నవలని మఱో విగ్రహానికే అంటగడ్తాం! ... నిజానికి మొదటి నవల వ్రాసిన వాడు అబ్రాహ్మణుడు కావడంవల్లే...".



4. "... మనకు ఏది ప్రధానమో తెలిసిపోయింది. కవికాలం కాదు. అతని జీవితం కాదు. కులం, వర్గం, విగ్రహం ముఖ్యం...' (ఎంత అసందర్భ పాక్షిక వాదన! శ్రీ చిలకమర్తి, శ్రీ చెన్నాప్రెగడ గారలు ఇద్దఱూ పురుషులే, ఇద్దఱూ ఒకే కులం వారే! మఱి ఎందుకు ఆపై రెండు ఉదాహరణాలు తెచ్చారో...?)

5. "... మనకు మొదటి సంస్కర్త, తాత్విక భూమిక నిర్మాత! సామినేని ముద్దు నరసింహం! ఆయన రాసిన 'హితసూచిని' తెలుగులో దేశీయ పునాదిని ఆధారంగా చేసికొని రాసిన మొదటి గ్రంథం! ఇందులో వితంతు వివాహాలను సమర్థించాడు! ఈ రచనా కాలానికి వీరేశలింగం వయస్సు ఐదేళ్ళు! 'హితసూచిని' గ్రంథం చదువకుండానే మొదటి సంఘసంస్కర్తగా వీరేశలింగాన్ని నిలబెట్టాం..."! (ఎంత కసి! ఎంత గ్రుడ్డి ద్వేషం! నరనరానా పక్షపాతపు రక్తం ప్రవహిస్తున్న పలుకులివి! భట్ట బాణుడు కూడా తన 'కాదంబరి' గ్రంథంలో "...యదేతత్ అనుమరణం నామ తదపి నిష్ఫలం! అవిద్వజ్జనాచరిత ఏష మార్గః..." అంటూ సతీ సహగమనాన్ని తీవ్ర పదజాలంతో నీచాతి నీచంగా నిరసించాడు! సారీ! భట్టబాణుడు కూడా బ్రాహ్మణుడే! శ్రీ జయధీర్ తిరుమలరావు గార్కి భట్ట బానుని కులమే కన్పిస్తుంది! నిజానికి బ్రాహ్మణుడైన భట్టబాణుడు సంఘసంస్కర్త కాలేదు! రాజారామోహనరాయ్ సంఘసంస్కర్త అయ్యాడు! అక్కడ కుల ప్రధాన్యం కాలేదు! క్రియా ప్రాధాన్యం అయింది! అలాగే వీరేశలింగం గారి కులమే శ్రీ జయధీర్ తిరుమలరావు గారి పక్షపాత కళ్ళద్దాలకు కన్పించినది తప్ప – ధైర్యంగా సమాజానికి ఎదురొడ్డి, ఎన్నో ఎదురు దెబ్బలు తింటూ, కబుర్లు మాత్రం చెప్పక, కథలు – కాకరకాయలు వ్రాసుకోక, కార్యరంగంలోనికి దిగి – వితంతు వివాహాలు జరిపించడం, బాల్య వివాహాలను అరికట్టడం, స్త్రీ విద్యను అమలు జరిపించడం, తన యావదాస్తిని ధారపోయడం వంటి సంఘసంస్కరణోద్దిష్ట సాహసకృత్యాలు. గా॥ శ్రీ జయధీర్ తిరుమలరావు గారి కళ్ళకు కానరావు! కళ్ళకు కన్పించినా 'కుల పక్షపాత భావజాల తరంగిణి' లోమునుకలిడుతున్న ఆయన గారి మనస్సు అంగీకరించదు! సమాజానికి ఎదురొడ్డి ధైర్యంగా విగ్రహం (యుద్ధం, సమరం) జరిపాడు కాబట్టే శ్రీ

వీరేశలింగం పంతులు గార్కి విగ్రహం వేసి గౌరవిస్తున్నాం! అంతే రాజరామ మోహనరాయలు కూడా! అంతేకాని భట్ట బాణునికి గాని, శ్రీ ముద్దు నరసింహంగార్కి గాని విగ్రహాలుగా మారే యోగ్యత లేదని గౌ॥ జయధీర తిరుమల రావు గారిని గుర్తించవలసినదిగా నా వినయపూర్వక వినతి.)

6. "... తన మిత్రుడు భానుమూర్తి రాసిన పద్యాన్ని తన మనస్సులో ఊహించు కొని (గుర్తుకు తెచ్చుకొని) చదివి ఉంటారు..." అంటూ పాత పాటనే పాడారు! (ఇచ్చట ఊహించుకుని అని వ్రాసిన తరువాత (గుర్తుకు తెచ్చుకొని) అని బ్రాకెట్టులో వ్రాయుటను గమనించ ప్రార్థన! శ్రీ చిలకమర్తి వారు అట్లే బ్రాకెట్ పెట్టి ఆ బ్రాకెట్‌లో ఏమీ వ్రాయలేదు! దానిని కూడా గమనించి ప్రార్థన.

7. "... మకుట పద్యం ఒకరు రాయగా దీన్ని పుణికి పుచ్చుకొన్న అదే శైలిలో మిగతా పద్యాలు మాత్రం వేరొకరు రాశారనడం ఎంత మాత్రం సరిగాదు..." (ఇదీ తప్పు! శైలి విభిన్నమే! రెండింటి మధ్యలో గల శైలీ వైరుధ్యమే అవి రెండూ భిన్న కర్తృకాలని ఋజువు చేస్తున్నది).

8. "... 1980ల నుండి ఆర్కైవ్స్‌లలో నుండి, గ్రంథాలయాల నుండి నిషేధ గేయాలను, వివిధ ఉద్యమ గీతాలను, సేకరణలో భాగంగా ఈ గీతాన్ని నేను సేకరించాను! సేకరించిన వివరాలను పోగొట్టుకోవడంవల్ల ఈ పద్యం ఎక్కడ అచ్చయిందో ఇప్పుడు చెప్పలేను..." (పోగొట్టు కోటానికి కారణభూత మైన నిర్లక్ష్యం నాకుంది. అని చెప్పడం సత్య నిరూపణకు సాక్ష్యం కాబోదు కదా! అయినా ఆ ప్రస్తావనము ఇక్కడ అంత అవసరమా??)

9. "... 'భరతఖండంబు' అన్న ఒక్క పద్యానికే కొటేషన్లు ("..."గుర్తులు) ఉన్నాయి! ఎందుకీ గుర్తులు? ఏమిటి సంకేతం? ఈ ఒక్క పద్యానికే వేరుగా గుర్తులు పెట్టారు! మఱి ఈ తదుపరి 27 పద్యాల గుర్తులు ఎందుకు పెట్టారుట? ప్రశ్నైతే వేశారు – సందిగ్ధ స్థితిలోనికి నెట్టారు – కాని సమాధానం మాత్రం చెప్పలేదు! అంటే, భరత ఖండంబు పద్యం స్ఫూర్తిదాయక (Model) పద్యం కావచ్చునేమో...మో...మో..!! అనే సందిగ్ధ స్థితి గౌ॥ శ్రీ జయధీర్ తిరుమల రావుగారి అంతరాంతరాల్లో ఉందేమో??? గమనించ ప్రార్థన).

10. "... అతను ప్రభుత్వ అనువాదకునిగా 1910 లో కొత్త ఉద్యోగంలోనికి మారవలసి వచ్చింది..." "...ఆయన ఈ కొత్త ఉద్యోగం చేయడానికి, ఈ



పద్యం చిలకమర్తి వారిదిగా ఆతరువాత ప్రచారం కావడానికి ఏమైనా సంబంధం ఉందా అనేదికూడా ఆలోచించాల్సిన అవసరం ఉంది..." (అంటూ ఆయన ఈ పద్యం చిలకమర్తి వారిదిగా ఇందువల్ల ప్రచారం కాబడింది అనే ఒక అసంబద్ధమైన కారణాన్ని తెరమీదకు తెచ్చారు! శ్రీ సుబ్బారావు గారు పుస్తకం 20వ పేజీలో "...అప్పటి ప్రభుత్వం తెచ్చిన ప్రత్యేక చట్టాన్ని దృష్టిలో పెట్టుకొని ముద్రించిన పుస్తకంలో ఎక్కడా కావ్యకర్త పేరును పేర్కొనలేదు..." అంటూ ఊతం ఇచ్చారు. సెభాస్ సుబ్బారావు గారు! ఏమిటా చట్టం? పరిశోధన చేశారా? వివరాలు ఇవ్వాలిగదా – ఇవ్వలేదేం? కాని అప్పటికే శ్రీ భానుమూర్తి గారు క్రైస్తవ కళాశాలలో పనిచేస్తూ కూడా వివిధ పత్రికలలో జాతీయ ఉద్యమ భావాలను; ఆంగ్లేయ పాలనకు వ్యతిరేకమైన పద్యాలను రచించి ప్రచురించారు! అయినా నిబద్ధత, నిజాయితీ (విద్యార్థులను ఉపశమింపచేయు ఘట్టం – పుస్తకంలో పేజీ 32) గల వ్యక్తిగా పేను పొందారు! శ్రీ భానుమూర్తి గారిని అరెస్ట్‌చేసి అండమాన్ దీవులకు పంపాలని ఆంగ్లేయ ప్రభుత్వం ఆలోచిస్తే – ఆశిస్తే – "భారతధర్మ దర్శనం" రచయితగా ఆయన పేరును ప్రచురించినందువల్ల శ్రీ భానుమూర్తి గార్కి ప్రభుత్వం వల్ల కొత్తగా రాగల ముప్పు అంటూ మఱొకటి ఉండదు. అయినా శ్రీ భానుమూర్తి 1910లో ప్రభుత్వ అనువాదకుడుగా ఉద్యోగంలో ప్రవేశించారు. మఱి 1907లో ప్రచురితమైన పుస్తకంపై ఆయన పేరు ఉండటానికి అప్పటికింకా చేరని ప్రభుత్వ ఉద్యోగం కారణంగా చూపడం శ్రీ జయధీర్ తిరుమల రావుగారికే చెల్లింది! ఆ భావాన్ని సమర్థించడం శ్రీసుబ్బారావు గారికే చెల్లింది.)

ఇలా ఇందఱు తమ తమ అభిప్రాయాల్ని వెలువరిస్తూ శ్రీ చిలకమర్తి వారిపై బురద చిలకరించడానికి ముప్పై పేజీలు వినియోగించారు. ఒక శ్రీ సుబ్బారావు గారు తమ వాదనకు మప్పైఐదు పేజీలు, 'దేశభక్తి కవిత్వానికి చిలకమర్తి వారే ఆద్యులు' అంటూ సందర్భంలేని అంశానికి మఱో పదిపేజీలు, ఒకటవ అనుబంధంగా "భారతధర్మ దర్శనము" 18 పేజీలలో, రెండవ అనుబంధంగా 'చిలకమర్తి గోదావరీ మండల పద్యాలు'ను నాలుగు పేజీల్లో అనుబంధం మూడవదిగా భారతధర్మ దర్శనం పుస్తకంలోని మొదటి పేజీని అందిస్తూ వెరసి ఇంచుమించు వంద పేజీల పుస్తకంగా ముద్రించారు.

ఇందఱు ప్రఖ్యాతులు, పరిశోధక పర్యవేక్షకులు తమ తమ అభిప్రాయాలు వెలిబుచ్చుటకు ఆధారమైన శ్రీ సుబ్బారావు గారి పరిశోధనాంశము లోనికి ప్రవేశించ బోవు ముందు, ఆ పద్యం శ్రీ చిలకమర్తి వారిది అని ప్రశంసించిన ఒక్కొక్కరిని ఎలా శ్రీ సుబ్బారావుగారు అభిశంసించారో, వాళ్ళపై ఎలా దుమ్మెత్తి పోశారో ఒకసారి తిలకిద్దాం!

ముందుగా డా॥ ముక్తేవి భారతి గారు తమ పరిశోధనా గ్రంథాన్ని "భరత ఖండంబు" పద్యంతో ప్రారంభించడాన్ని తప్పు పట్టారు. "... చిలకమర్తి వారి పేరు వినగానే తెలుగు వారి నాలుకల మీద తేనెలూరేటట్లుగా చేసే తేటగీతి ఇది..." అని భారతి గారు వ్రాయడాన్ని ఈయనగారు బలహీనపరుస్తూ "ఇదే నిజమైతే ది. 02/02/68న 'చిలకమర్తి జీవితం – కార్యకలాపములు' అను అంశంపై శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు ప్రసంగించారు. అందులో 'భరతఖండంబు' ఊసే లేదు. అది చిలకమర్తి వారిది కాదు కాబట్టి వారలా చేశారు..." అని శ్రీ సుబ్బారావు వ్రాశారు! నిజమేనేమో? అది ప్రసంగం. ఉపన్యాస ధోరణిలో బది కొన్ని సంగతులు స్థాలిత్యాన్ని పొందవచ్చు కూడా. అయినా శ్రీ సుబ్బారావు గారి వాదనలోనికే తొంగి చూద్దాం! "... నిజానికి ఈ పద్యం చిలకమర్తి వారు వ్రాయలేదు. వ్రాసింది చెన్నా ప్రెగడ భానుమూర్తి! కాకపోతే మా చిలకమర్తి వారు అదృష్టవంతులు. ఈ పద్యం చిలకమర్తి వారిదిగా ప్రచారం అయింది..."అని కూడా శ్రీ మధునాపంతులవారు చెప్పలేదు కదా! అయినా ఆ ప్రసంగం ముంద్రిపబడలేదు. ముద్రిత ఆధారం ఉంటే – అదీ మధునాపంతులవారి కలం నుండి వెలువడినదే అయితే వారు మాటాడకుండా అంగీకరిస్తారా సుబ్బారావు గారు! అయితే ఇదిగో ఈ ఆధారాన్ని చూడండి! శ్రీ మధునాపంతుల వారు రచించిన ఆంధ్రరచయితలు (సరస్వతీ ప్రెస్, రాజమహేంద్రవరము 1950) ప ఏజీ 234లో సాక్షాత్తూ శ్రీ మధునాపంతుల వారే రచించిన ఈ క్రింది వ్యాక్యాలను తిలకించండి. "... మఱియొక విషయము. 1907లో వంగ దేశము నుండి 'విపిన చంద్రపాలు' అనునాతడు వచ్చి 'గోదావరీ మండల మహాసభలో నుపన్యసించుచుండెను. ఉపన్యాస సందర్భమున ఆశువుగ లక్ష్మీ నరసింహం గారు ఈ పద్యముచదివిరి! "భరతఖండంబు ... బిగియఁగట్టి". నాడు కొన్ని నాళ్ళీ గీతము చదువని వారు లేరు. బహుజనముచే నాదరింపబడు కవితయే కవిత. అదియే శాశ్వతముగా నిల్చును...' అని శ్రీ మధునాపంతుల



వారు వ్రాసిరి. ఇప్పుడే మంటారు సుబ్బారావు గారూ! ఇది వ్రాసిన 18 సంవత్సరాల తర్వాత హైదరాబాద్ సభ జరిగింది. శ్రీ చిలకమర్తి వారు గతించు నాటికి శ్రీ మధునాపంతుల వారు 26 సంవత్సరముల ప్రాయముగల వారు కూడా!

ఇక శ్రీ సుబ్బారావు గారి తుపాకీని డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారిపై నెక్కుపెట్టిరి! "... డా॥ కొత్తపల్లి వీరభద్రరావు తన పరిశోధనా గ్రంథం "తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం"లో 1907లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశమునకు వచ్చిన సందర్భములో సహజ కవితా ధారతో వీరు (చిలకమర్తి) చెప్పిన 'భరత ఖండంబు చక్కని పాడియావు' అను పద్యము అజరామరము..." అని ఒక దోషానికి సాక్ష్యమిచ్చారు అంటూ డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారిపై శ్రీ సుబ్బారావు గారు నేరారోపణ చేశారు! ఇంకా "... భరతఖండంబు చక్కని పాడియావు"అను చిలకమర్తి వారి పద్యమును పోలిన పద్యములు 'నక్షత్రమాల'గా వీరు (చెన్నాప్రగడ) రచించిరి..." అని డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారు వ్రాయడం శ్రీ చెన్నాప్రెగడ వారిని అవమానించడమే అవుతుంది..." అంటూ డా॥ కొత్తపల్లి వారిపై కత్తిదూశారు. ఇంకా "...ఈ చెన్నాప్రగడ వారి పేరుతో వ్రాసుకున్నారు. కాని దీనికి నక్షత్రమాల లోని మొదటి పద్యమైన 'భరతఖండంబు' ఎందుకు కనబడలేదు? పైగా అది చిలకమర్తి వారి పద్యమని వ్రాయడమా? ఒక పరిశోధకుడు వాస్తవాలను విస్మరించినా ప్రమాదం లేదు. కాని దానిని వక్రీకరిస్తేనే నేరమౌతుంది..." అంటూ డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారిని శ్రీ సుబ్బారావు గారు తన పరిధి దాటి అమర్యాదకరంగా అభిశంసించారు.

డా॥ సి.నా.రె. గారు, వారు వ్రాసిన "ఆధునికాంధ్ర కవిత్వము", 'సమగ్ర సాహిత్యం' గ్రంథములను తరువాతి బలి స్వరూపాలుగా శ్రీ సుబ్బారావు గారు ఎంచుకున్నారు.

1. బిపన్ చంద్రపాల్ గారి ఉపన్యాసమును విని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహా రావుగారు వ్రాసి చదివిన పద్యమట ఇది.
2. పాల్ గారి ఉపన్యాసము విని ఉద్రిక్తులై ఈ పద్యంవ్రాసి చదివారనడం పరిశోధకునకు (సి.నా.రె.గార్కి) భావ్యం కాదు.

ఇట్లాంటివే మఱి కొన్ని అభియోగాలను శ్రీ సుబ్బారావుగారు డా॥సి.నా.రె. గారిపై చేశారు. 1906లో సభజరిగిందని డా॥ సి.నా.రె. వ్రాశారని శ్రీ

సుబ్బారావుగారు ఆక్షేపించారు. డా॥ సి.నా.రె. గారు 1907 అనే వ్రాశారు! (అధు
కాంధ్రకవిత్వము) శ్రీ సుబ్బారావుగారే పొరబడ్డారు.

ఇప్పట్టున శ్రీ సుబ్బారావుగారి ఆక్రోశం చూడండి. "...అసలీ పద్య
చిలకమర్తివారు వ్రాసింది కాదని తేలింది. ఇంత ఘోరం ప్రపంచంలో ఎక్కడైనా
ఉందా? ఈ అపచారం శాశ్వతంగా కొనాసాగాల్సిందేనా???..." అంట
ఆక్రోశించారు.

"... డా॥ మద్దూరి సుబ్బారెడ్డిగారు అటు చిలకమర్తి వారిని, ఇటు
చెన్నాప్రెగడ వారిని స్కానింగ్ తీసి శోధించారు. అయినా 'భరతఖండంబు' భానుమూ
గారు వ్రాసిన పద్యమేనని తేల్చకుండా తప్పుకున్నారు. చిలకమర్తి వారికే జైకొట్టారు...
అంటూ డా॥ మద్దూరివారిని శ్రీ కరణం సుబ్బారావుగారు దోషిగా చూపారు.

"... ప్రొఫెసర్ మామిడిపూడి వెంకట రంగయ్యగారి సంపాదకత్వం
వెలువడే "ఫ్రీడం స్ట్రగుల్ ఇన్ ఆంధ్ర" అనే గ్రంథం సంపుటి 2లో చివరి రోజు
"…. he(అంటే చిలకమర్తి) Composed a Verse in Telugu Conveying th
gist of the Lecture ..." అని పేర్కొన్నారు. చిలకమర్తి వారు "నా మనసు
ఊహించుకొని.... చదివితిని' అని చెప్పకొంటే, దాన్ని ఈ చరిత్రకారుడు he Com
posed అని పేర్కొన్నారు. అది ఏ మాత్రం ఆమోదించదగిన అభిప్రాయం, అనువాద
కాదు..." అని శ్రీ సుబ్బారావు గారు వెంకట రంగయ్య గారిని అభిశంసించారు.

ఆకాశవాణికి చెందిన శ్రీ ఎం. సత్యనారాయణ గారు "... వీరి చారిత్రాత్మ
మైన పద్యం. జాతీయ సారస్వతంలో ప్రథమ సృష్టి అని చిలకమర్తి వారిని గుతించి
వ్యాసంలో వ్రాశారు..." అని శ్రీ సుబ్బారావుగారు, శ్రీ ఎం. సత్యనారాయణ గారి
తప్పు పట్టారు.

"జాతీయ గీతాలు" సంపాదకులు శ్రీ గురుజాడ రాఘవశర్మ గా
'జాతీయత' అను శీర్షికపెట్టి అందులో చిలకమర్తి వారి కమ్మని కలకండ పలు
అని అందుకు ఉదాహరణముగా – శ్రీ చిలకమర్తి వారిదిగా ఈ పద్యాన్ని పేర్కొన్నార
ఈ పద్యాన్ని శ్రీ చిలకమర్తి వారిని విడదీయలేని విధంగా శ్రీ రాఘవశర్మ గా
బంధించారు అని శ్రీ శర్మ గారిని శ్రీ కరణం సుబ్బారావుగారు నిరసించారు.

రచయితలు, సంపాదకులచే రూపుదిద్దుక్ను "... తెలుగు చరిత్ర – సంస్కృ
గ్రంథంలో జాతీయోద్యం అను శీర్షికలో "... బిపిన్ చంద్రపాల్ ఉపన్యాస



తెలుగులో కనువదించిన ప్రసిద్ధ రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు పాల్
ఉపన్యాసాలకు ముక్తాయింపుగా 'భరతఖండంబు' అని ఆశువుగా చెప్పిన పద్యం
సభా సదుల్ని ఉత్తేజితుల్ని చేసింది..."అంటూ వ్రాసినరచయితల్ని సంపాదకులను
శ్రీ సుబ్బారావుగారు అభిశంసించారు.

డా॥ మొదలి నాగభూషణ శర్మ గారు 'తెలుగు సాహిత్యం గాంధీజీ ప్రభావం'
అనుగ్రంథంలో 'భరతఖండంబు' అనే పద్యం జాతీయోద్యమ కవిత్వంలో తొలిరచన
కాకపోవచ్చును... 'అని సందేహాన్ని వ్యక్తం చేశారే గాని అది శ్రీ చిలకమర్తి వారిది
కాదనలేదు. '...వీటన్నిటికి ముందు చిలకమర్తి వారి పద్యమును ఉల్లేఖించటంలో
అప్పటికే ఈ పద్యం యొక్క ప్రశస్తి ఎంతగానున్నదో మనకు తెలుస్తోంది..." అనివ్రాసి
ఒక అపచారానికి అండగా నిల్చారు...' అంటూ శ్రీ సుబ్బారావు గారు శ్రీ
నాగభూషణశర్మ గారు అపచారం చేశారని ఎత్తి చూపారు. (డా॥ మొదలి నాగభూషణ
శర్మ గారు వ్రాసిన పూర్తి పాఠవాన్ని (తెలుగు సాహిత్యం– గాంధీజీ ప్రభావం'
ఖండకావ్యాలు – ఖండికలు పేజీ 47) ఇక్కడ తెల్పడం అసందర్భం కాదనుకుంటాను.
"...ఈ గ్రంథంలో నాల్గు భాగాలున్నాయి! మొదటిది 'వందేమాతరం'అన్న
బంకించంద్ర గేయానికి తెలుగు అనువాదం. రెండవది 'హిందూ దేశ దైన్య
విచారము", మూడవది "భవిష్యద్భారత వర్ష దర్శనము", నాల్గవది "భారతీయ
ధర్మాధర్మ నక్షత్రమాల", వీటి అన్నింటికినీ ముందు చిలకమర్తి వారి పద్యము
ఉల్లేఖించబడటంతో అప్పటికే ఈ పద్యం యొక్క ప్రశస్తి ఎంతగా ఉన్నదో మనకు
తెలుస్తుంది. 'వందేమాతరం' శీర్షిక క్రింద పద్యాలు 1905లో వంగరాష్ట్ర విభజన
సందర్భంలో వ్రాయబడినది..." అన్న వాక్యం యొక్క భావమేమి? అనగా కొటేషన్లలో
పెట్టబడి, ముందు మొదటి పద్యంగా ముద్రింపబడిన 'భరతఖండంబు.." పద్యం
శ్రీ చిలకమర్తివారిదే... అని గదా! కనుక ముందున్న ఆ పద్యం చిలకమర్తి వారిది
అని డా॥ మొదలివారు నిక్కచ్చిగా, నిజాయితీగా, నిర్మొగమాటంగా అంగీక రించినట్లే
గదా! సుబ్బారావు గారూ! దయతో గమనించ ప్రార్థన)

"... శ్రీ కొడవటిగంటివారు "ప్రేమ"అను శీర్షికతో వ్రాసిన గల్పికలో
"...బిపిన్ చంద్రపాల్ సభలో చిలకమర్తివారు ఆశువుగా చెప్పిరి..."అని పేర్కొన్నారు.
"...అని శ్రీ కొడవటి గంటి వారిది కూడా తప్పిదమనే శ్రీ సుబ్బారావు గారు
తెల్చారు.

ఇక కొన్ని విశ్వవిద్యాలయాలు, ఏ.పి.పి.యస్.సి. వారి స్టడీ మెటరియ
లను, ప్రశ్నలనిధి, తెలుగువాచకాలను, కూడా వదలకుండా ఉదహరించి, '...భ
ఖండంబు...' శ్రీ చిలకమర్తి వారిదే అని ముద్రిస్తూ వచ్చారు..." అంటూ
సుబ్బారావు గారు ముగింపుగా ఏమని వ్రాశారో చూడండి!

"...కొందరు వ్రాశారంటారు మరికొందరు ఆశువుగా చెప్పారంటా
ఇంకొందరు వ్రాసి చదివారంటారు. "ఊహించుకొని...." అన్న చిలకమర్తివ
పదాన్ని పట్టించుకోకుండా సాహితీ దిగ్గజాల మధ్య ఏమిటీ వైవిధ్యం? ఈ పనిచేసి
పెద్దల్లో అధికులు అధ్యాపకులే. "A Teacher is a responsible Student" అంటా
డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్. అధ్యాపకుడు ఆ బాధ్యతను పాటించకపోతే చదువ
చట్టబండలౌతుంది..."

ఇక రెండవ అధ్యాయానికి "కళ్లు తెఱచి చూద్దాం..."అను శీర్షిక న
"...భానుమూర్తిగారు ఆ పద్యం విన్నంతనే ఉత్తేజితులై దానినొక చోట వ్రాసుక
వారిపై గౌరవం వలన అదే స్ఫూర్తితో తన సొంత పద్యాలింకో 27 చేర్చి ద
పెట్టుకొని యుందురనిపించును" అని డా॥ భారతిగారు ఓ కట్టు కథను సృష్టి
'తెలుగు' వారనిపించుకున్నారు..."అని శ్రీ సుబ్బారావుగారు వ్రాశారు. (శ్రీ సుబ్బారా
గారు తన స్థాయిని మఱచిపోవడం ఒకటే కాదు, డా॥ భారతి గారి స్థాయిని కూ
గుర్తించ లేకపోవడం క్షమించరాని నేరం కాదా? అంతే కాదు. తెలుగు వారం
కట్టు కథలు అల్లేవారుగా అభియోగం మోపినట్లుగా లేదా? మఱి శ్రీ సుబ్బారా
గారు ఆంధ్రేతరులా? తెలుగువారు కాదా? ఈ వ్యాసం అంతా చదివిన తరు
డా॥ భారతి గారికి శ్రీ సుబ్బారావు గారిచ్చిన కితాబునకు వారే అర్హులౌతారెమో...

డా॥ భారతి గారు 'నక్షత్రమాల' అంటే 27 పద్యాలేగా ఉండాల్సింది, 2
పద్యాలున్నాయేమిటి? అని ప్రశ్నించారు! 27 నక్షత్రమాలకు తోడు 'అభిజిత్' అ
ఓ ప్రత్యేక నక్షత్రం ఉంది? "... అని శ్రీ సుబ్బారావు గారి సమర్థింపు" (
అభిజిత్‌ను గురించి తర్వాత విశ్లేషిస్తాను.) కందం వ్రాసినవాడే కవి గదా! అంద
28వ పద్యం కందంలో వ్రాశాడు..." అని మఱోపేలవమైన ముక్తాయింపు ఇచ్చార
శ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తి గారికి తాను కవినని బోడి ఈ కందపద్యం వ్ర
ఋజువు చేసుకోవాల్నా? ఆయన ఈ పాటికే కవిగా లబ్ధి ప్రతిష్ఠులని వీరు వ్రాసి
పత్రికలు అచ్చువేసి ప్రచురించిన గత పద్య రచనలే ఋజువు చేశాయి గదా!!'



"ఈ పద్యాన్ని 1905కు ముందు చిలకమర్తి వారు చదివినట్లుగా గాని,
ప్పినట్లుగా గాని, వ్రాసినట్లుగా గాని ఆధారాలుంటే చూపించవలసిందిగా కోరు
న్నాను..." అంటూ మరో సవాలు విసిరారు! (ఎందుకుంటుంది? చిలకమర్తి
ారు 1907లో పాల్ గారి సభలో "ఊహించుకొని" చెప్పిన పద్యం గదా అని!
సలీ ప్రశ్న అర్థమేమిటో బోధపడుటలేదు.)

"...ఈ పద్యాన్ని (ఊహించుకొని' నమ్ముకొని పద్యకర్తృత్వం నిర్ధారించడం
ంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లే అవుతుంది..." అని సుబ్బారావు
ారి తీర్మానము. (హతోస్మి)

"... భారత ధర్మ దర్శనము 1905లో వ్రాయబడిందని తెలిసి ఉంటే వీరు
వ్యాంధ్ర సాహిత్య వీధులు – రచయితలు) ఈపనిచేసేఆరు కారు..." అని శ్రీ
ుబ్బారావు గారి అభియోగము (1905లో భారతధర్మ దర్శనం రచింపబడిందని
సుబ్బారావు గారు ఈ పుస్తకంలో హేతుబద్ధంగా ఋజువు చేయలేదు. ఇక్కడ
నొక సందేహాన్ని వ్యక్తం చేస్తాను. దయతో అవిధేయతగా భావించవద్దు! డా॥
త్తపల్లి వీరభద్ర రావు గారు "తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం" గ్రంథంలో
జీ 50లో "వంగ రాష్ట్ర విభజన సందర్భమును పురస్కరించుకొని వీరు (చెన్నాప్రెగడ
ానుమూర్తి గారు) రచించిన 'భారత ధర్మ దర్శనము'మిక్కిలి ఉత్తేజకరమైన కావ్యము
1905) మనమన్ని వస్తువులకు విదేశీయులపై నాధారపడవలసి వచ్చెనే యని
ంతించుచు వీరు వ్రాసిన ఈ పద్యము వీరి స్వాతంత్ర్య పిపాసను తెలుపునదై
ున్నది. "ప్రొద్దున్న లేవంగ... నకలు (హిందూదేశ దైన్యవిచారము) ఆ తరువాత
రాగ్రాపునందు "భరతఖండంబు...' అను చిలకమర్తి వారి 'పద్యమును బోలిన
ద్యములు 'నక్షత్రమాలగా వీరు రచించి..."అని వ్రాసినారు. అనగా 1905 బెంగాలు
భజన సందర్భముగా ఈ "హిందూ దేశ దైన్య విచారము" అను ఖండిక రచింప
డినదను విషయమునకు ఆధారమేర్పడినది.

ఇకా డా॥ సి.నా.రె. గారు "తమ ఆధునికాంధ్ర కవిత్వము" పుస్తకం పేజీ
79లో "చెన్నాప్రెగడ భానుమూర్తిగారు "భారతదర్శనం"లో పారతంత్ర్య స్థితిని,
శములోని ఆర్థిక హైన్యమును చక్కగా చిత్రించినారు..." అని వ్రాశారు! అంటే
॥ డా॥ సి.నా.రె. గారు కూడ "హిందూ దేశదైన్య విచారము" ఒక్కటే 1905
ంగాలు విభజన సందర్భముగా భానుమూర్తిగారు వ్రాసిరను అభిప్రాయములో
ండినట్లు మనం భావించవచ్చును. డా॥ మొదలి నాగభూషణ శర్మగారు "తెలుగు

సాహిత్యము - గాంధీ ప్రభావము"అను తమ గ్రంథంలో "ఖండకావ్యములు ఖండికలు అను ఉపశీర్షిక క్రింద "ఈ గ్రంథంలో నాల్గు భాగాలు ఉన్నాయి! మొదట "వందేమాతరం" అన్న బంకించంద్ర గేయానికి తెలుగు అనువాదం..."అని వ్రాశా కావున 'భారతధర్మ దర్శనంలో మొదటి రెండు ఖండికలు (వందేమాతరం, హిం దేశ దైన్య విచారము) 1905 బెంగాలు విభజన సందర్భంగా, ప్రేరేపితులై భానుమూర్తిగారు రచించినట్లు ఈ ముగ్గురు ప్రముఖుల వ్రాతలవలన తెలయుచున్న మరి మిగతా ఖండికలు ("భవిష్యదర్భరత వర్ష దర్శనము) (భారతీయ ధార్మాధ నక్షత్రమాల") ఎప్పుడు వ్రాయబడినట్లు??? డా॥ మొదలి నాగభూషణశర్మ గా మరొకమాట కూడా అన్నారు. "ఇదే కాలానికి చెందిన ముఖ్యమైన రచన చెన్నాప్రె భానుమూర్తి గారి భారతధర్మ దర్శనము" ప్రచురణ 1907 లోనే జరిగినా ఇందుల ఖండికలు 1905-1907 మధ్య కాలములో వ్రాసినవే..."అని కూడా అన్నా అనగా మిగతా రెండు ఖండికలు ఆ తరువాతవ్రాయబడినవన్నమాట. అన్నీ కలిపి 1907లో పుస్తకరూపాన్ని తెచ్చారని శర్మగారి భావమేమో? అంటే 19 ఏప్రిల్ తరువాత - (శ్రీ చిలకమర్తి గారి పద్యం వెలువడిన తరువాత) - 19 అక్టోబరు ఒకటవతేదీలోపుగా - "భారదీయ ధర్మాధర్మ నక్షత్రమాల" శ్రీ భానుమూ గారిచే రచింపబడి యుండ కూడదా? కాబట్టి సందర్భోచిత పద్యాలుగల మొద రెండు ఖండికలు 1905లో వ్రాయబడి, ఆ తరువాత కాల క్రమేణా 1907 ఏప్రిల - అక్టోబరు నెలల మధ్య వ్రాయబడిన మిగతా, రెండు శీర్షికలను కలిపి మొత్త నాల్గు శీర్షికలతో శ్రీ వేమవరపు రామదాసు గారు 1907లో పుస్తకంగా ముద్రి ఉండవచ్చు!

మనలో మనమాట! శ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తి గారు 'డైరీ' వ్రా అలవాటు కలవారని, శ్రీ సుబ్బారావుగారి ఈ పుస్తకం 26వ పేజీలో వ్రాసి ఉ "భానుమూర్తి గారికున్న మంచి అలవాట్లలో దినచర్య (డైరీ) వ్రాయటం ఒకటి! అని శ్రీ సుబ్బారావు గారు వ్రాశారు. మరి డైరీలో ఏమి వ్రాశారో?? కాలకృత్యముప తీర్చుకొనుట ఇత్యాదులే వ్రాయుట కొఱకు కాదుకదాడైరీ. అట్లుకాక తమ రచన ఏయే తేదీలలో వ్రాశారో శ్రీ భానుమూర్తి గారు తమ డైరీలో నమోదు చేసుక ఉండే ఉంటారేమో?? శ్రీ సుబ్బారావు గారూ - దయతో పరిశీలించారా??

ఇక్కడే నేను సుబ్బారావు గారి ముందు మరొక సందేహాన్ని ఉంచుతా 1907 ఏప్రిల్ నెలకు ముందు అంటే పాల్ సభలో శ్రీ చిలకమర్తి వారు చదువు



ముందు ఈ పద్యం శ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తి గారు వ్రాసినట్లుగా వారి పేరుమీద నాటి పత్రికలలో ఏ పత్రికలోనయినా ప్రచురింపబడిందా?

కాకపోతే విజ్ఞులు, గౌరవనీయులు శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి గారు తాము సంకలనం చేసిన "భానుమూర్తి కావ్య కుసుమాంజలి" గ్రంథంలో భారత ధర్మాదర్శ నక్షత్ర మాల" అను ఖండిక క్రింద బ్రాకెట్లలో 1905 వంగరాష్ట్ర విభజన సందర్భములో రచింపబడినవి అని ముద్రించిరి. అంతేకాదు భరత ఖండంబు పద్యానికి గల కొటేషన్లను శ్రీ సూర్యనారాయణమూర్తిగారు ఎందుకు తొలగించినట్లు? 1907లో ముద్రించబడిన భారత ధర్మదర్శనం పుస్తకం పూర్వ లిపిలో ఏ శీర్షికకు వరుస సంఖ్యలు లేవు. మరి శ్రీ పోతుకూచి వారు తమ సంకలిత 'భానుమూర్తి హృదయ కుసుమాంజలి' గ్రంథంలో పద్యాలకు వరుస పంఖ్యలను ఎందుకు వేసినట్లు? ఆ విధంగా చేయుటకు శ్రీ సూర్యనారాయణమూర్తి గారికి గల అధికారం ఏమిటి? అట్లు చేయడం వల్ల పాఠకుని మాత్రమేగాక సమీక్షకులగు శ్రీ శివశంకర స్వామి ప్రభుతులను కూడా ప్రక్క త్రోవ పట్టించినట్లు కాలేదా? పైగా "...ఈ సమస్యకు ...లో బీజం నాటింది. ...శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తిగారు..." అనికూడా శ్రీ సుబ్బారావు గారు (పేజీ రోమన్ అంకెలు 28లో) వ్రాసుకొనదాన్ని కూడా దయతో గమనించ ప్రార్థన. ఎక్కడా లేనట్టి ఇటువంటి సమస్యనొకదానిని సృష్టించి (1956లో) ఇంత స్థాయికి దిగజార్చడానికి కారణం గౌరవనీయులు శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తిగారి అత్యుత్సాహం కారణం అని భావించడంలో అనౌచిత్యం ఉంటుందని నేను సందేహించడం లేదు.

"...1907లో ఆంగ్లప్రభుత్వం తెచ్చిన ప్రత్యేక చట్టాన్ని దృష్టిలో పెట్టుకొని భారత ధర్మదర్శనం రచయిత పేరును శ్రీ వేమవరపు రామదాసు గారు పుస్తకం అట్టపై ముంద్రిచయుండలేదు!..." అని శ్రీ సుబ్బారావుగారు ఈ పుస్తకంలో వ్రాసిరి! శ్రీ భానుమూర్తి గారు ఇట్లాంటి చట్టాలకు భయపడే వ్యక్తి కాదు! అలాఅయిన 1907కు ముందు జాతీయ భావాలు ప్రోది చేసుకున్న ఎన్నో పద్యాలు వ్రాసి పత్రికలలో ప్రచురింపజేసి ఉండేవారు కారు.)

ఇవే "భరత ఖండంబు చక్కని పాడియావు" ఈ పద్యాన్ని వ్రాసిందెవరు?" అను పేరుతో తాను సత్యశోధకునిగా శ్రీ కరణం సుబ్బారావు గారు ప్రచురించిన పుస్తకంలోని అభిశంసలు, ఆరోపణములు! కొన్ని కొన్నిటికి నా అభిప్రాయాలను బ్రాకెట్లలో సూచించాను. ఇక ప్రధానాంశాలపై విశ్లేషణ అందిస్తాను.

ఇందుకు సమీక్షకుల, ప్రధాన రచయిత దృష్టిని సూదంటురాయి
ఆకర్షించిన పదం "ఊహించుకొని" కనుక – ఈ పదాన్ని ఎవరెవరు ఎ
వ్యాఖ్యానించారో ముందుగా పరిశీలిద్దాం!

1. ముందుగా దినపత్రికలో ఈ పదంపై తమ అభిప్రాయాన్ని ప్రకటించినవా
డా॥ యస్వీ సత్యనారాయణ గారు! "... మొదటి 'సభలో కూర్చొని నా మనసు
ఊహించుకొని' అని అనడంలో అది తన పద్యంఐనా కావచ్చు, లేదా ఇతరు
పద్యమైనా కావచ్చునన్న ధ్వని ఉంది! మనసులో అల్లుకొని, మనసులో రచించుకొ
అని చిలకమర్తి పేర్కొనలేదు. రెండవది – "ఈ క్రింది పద్యములను బహిరంగము
కట్టకడపట చదివితిని" అనడంలో జాగ్రత్త తెలుస్తుంది. చదవడానికేముంది? ఎవ
పద్యాన్నైనా చదవచ్చు. ఇక్కడ మనం గమనించాల్సిన అంశం "యూహించుకొ
చదువుట'! చిలకమర్తి స్వయంగా తానీ పద్యాన్ని ఆశువుగా అల్లి చెప్పితిని అనిగా
రచించితిని అనిగాని పేర్కొన లేదు..." అని శ్రీ సత్యనారాయణ గారు వ్రాశారు

ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ వ్రాసిన వారలలో రెండవవారు శ్రీ జయధీ
తిరుమలరావు గారు. వీరిద్దరి వాదననే ఆధారంగా తీసికొని ఇక శ్రీ సుబ్బారా
గారు విజృంభించారు! అంతేకాదు 'ఇక ఈ పద్యాన్ని నమ్ముకొని పద్య కర్తృత్వ
నిర్ధారించడమంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్లే అవుతుంది..." అ
వేళాకోళం కూడా చేశారు. ఇంకా శ్రీ సుబ్బారావు గారు "... స్వీయ చరిత్రలో
పద్యం తనది అని వ్రాసుకొనే ధైర్యంలేకే, తన పేరిట అత్యంత ప్రాచుర్యంపొందట
వల్ల దీని కర్త భానుమూర్తి గారని చెప్పటానికి ఇష్టంలేక ఊగిసలాడి, చివర
'ఊహించుకొని' అనే పదాన్ని ఈ పద్యంముందు తగిలించారు. ఇలా చేయడం
చిలకమమర్తి వారు మిత్ర భేదానికి పాల్పడి భానుమూర్తి గారి పట్ల అధర్మాని
ఒడిగట్టారు..." అని కూడా తీవ్ర పదజాలంతో శ్రీ చిలకమర్తిని నిందించారు!

శ్రీ సుబ్బారావు గారూ! ఈ వ్రాతలు ఉత్తమ సంస్కారాన్ని సూచిస్తాయా
లేక దుందుడుకు తనాన్ని సూచిస్తాయా? మీరే ఆలోచించండి! ఎంత ఆవేశం ఉన
సంస్కారాన్ని వదిలేయకూడదు కదండీ! శ్రీ చిలకమర్తి వారి ముందు మనం ఎంతండి
శ్రీ చిలకమర్తి వారి వ్యక్తిత్వం మీద అంత అసహ్యకరమైన వ్యాఖ్యానం చేయవచ
సుబ్బారావు గారూ! మీకు శ్రీ చెన్నాప్రెగడ మీద అభిమానం, ప్రేమ ఉండవచ్చు
కాదనను. కాని శ్రీ చిలకమర్తి వారికి శ్రీ భానుమూర్తి గారిపై గల భావనను, భక్తి



గౌరవాన్ని మనం మన్నించవద్దా! శ్రీ చిలకమర్తి వారి స్వీయ చరిత్ర (విశాలాంధ్ర ప్రచురణ) పేజి 12లోని శ్రీ చిలకమర్తి వారి ఈ క్రింది వాక్యాలను చదవండి –

"...భానుమూర్తి గారును, నేనును ఒకే పాఠశాలలోనే చదువుకొనుటచేత, మాకిరువురకు స్నేహభావమేర్పడెను. తరువాత మేమిరువురము చెరియొక యూరిలో నున్నను భానుమూర్తి గారికిప్పటికిని నాయెడ సత్యంత స్నేహము, ప్రేమయు కలవు. భానుమూర్తి గారు ఉభయభాషలయందు ప్రవీణులు. ఇంగ్లీషునందు బి.ఏ., పరీక్షయందుత్తీర్ణులైనారు. విశేషించి బ్రహ్మజ్ఞాన సంపన్నులు, భూతదయాళువు, నుదారశీలుడు. సుగుణపుంజమై యాంధ్రదేశమునకొక అలంకారమయ్యెనని చెప్పవచ్చును. అదృష్టవశమున నీయనిప్పటికిని, నేటికిని (1942) ఆరోగ్యముగ నున్నారు..."అని వ్రాశారు.

అదే పుస్తకం పేజీ 44 నందు "... నా కవిత్వమును గూర్చి ఒక్కమాట ఇచ్చట చెప్పవలెను. చిన్ననాడు నేను వీరవాసరములో చదువుకొనుచున్నప్పుడు నా మిత్రుడు చెన్నాప్రెగడ భానుమూర్తి గారు నా కంటె పై తరగతిలో చదువుచున్నప్పుడే కవిత్వము చెప్పనారంభించెను. పులినిచూచి నక్క వాత పెట్టుకొన్నదన్న సామెతగ, శబ్దజ్ఞానము లేకపోయినను, లక్షణము రాకపోయినను నేను కూడ పద్యములు చెప్పవలెనని..." అని వ్రాసిరి.

శ్రీ భానుమూర్తి గారు తనకంటె పెద్ద వారని, విజ్ఞానులని, దయాశీలురని, స్నేహపాత్రులని శ్రీ చిలమర్తి గారికి భానుమూర్తి గారిపై గౌరవము మిక్కుటముగా గలదు. పైపెచ్చు తనపట్ల శ్రీ భానుమూర్తి గార్కి ప్రేమాభిమానములు మెండు అని కూడా శ్రీ చిలకమర్తి గారికి తెలుసు! అటువంటి వ్యక్తి వ్రాసిన పద్యాన్ని తనదిగా ప్రచారం చేసుకొనేంత నీచులా శ్రీ చిలకమర్తి వారు... ఆలోచించండి సుబ్బారావు గారూ! ఎవడో ఒక చెట్టు క్రింద ప్లీడరు, పైపెచ్చు స్వంత అన్న గారిచే ఈసడించ బడిన వారు, వృత్తిపట్ల నైతిక నిబద్ధత లేని శ్రీ టంగుటూరి శ్రీరాములు గారి వ్రాతలా ప్రమాణాలు?? వ్రాయు వారి వ్యక్తిత్వమును బట్టి వ్రాతలకు విలువ నీయవద్దా! మఱొక రచయిత, లేదా కవి ఎవడైనా శ్రీ చిలకమర్తిని ఈ విధంగా దూషించిన, విమర్శించిన సందర్భం చూచారా? చూపగలరా సుబ్బారావు గారూ!

మఱొక్కమాట! శ్రీ చిలకమర్తి వ్రాసిన ఈ క్రింది సంఘటన (అదే పుస్తకం పేజీ 35లోనిది) చదవండి!

"రెండవసారి ఉత్సవము (విక్టోరియా మహారాణి సువర్ణోత్సవము) జరుగునప్పటికొక చిత్ర కథ జరిగెను. నా పరిచితుడొకడు రాణి గారి మీద పద్యములను చెప్పవలెనని కుతూహలము పడెను. కాని యతనికి లక్షణ జ్ఞానములేదు. ...నేను వారి మాటను బట్టి తొమ్మిది పద్యములను వ్రాసివానికిచ్చితిని. అతడు ఆ పద్యముల క్రింద తనపేరువేసికొని, యచ్చువేయించి సభలో తక్కిన వారి పద్యములతో బాటు శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారిచే చదివించుకొనెను..." (శ్రీ చిలకమర్తి ఈ పరిచితుని పేరు వ్రాయలేదు! ఆ రోజులలో ఆ సంఘటనయందున్న వారందఱూ ఇందుకుసాక్షులే!..." ఇదే ఔన్నత్యం అంటే) ఈ సంఘటనద్వారా మనకు అర్ధమయ్యే సారాంశమేమిటి? శ్రీ చిలకమర్తి పేరుకోసం తాపత్రయ పడువాడుకాడు! తాను వ్రాసిన పద్మములను వేఱొకడెవఱో చదివినను, వేఱొకఱెవఱో తన రచన క్రింద వారి స్వీయపద్యాలుగా పేరు వ్రాయించిఉకొన్నను సహృదయతతో స్వీకరించిన స్నేహశీలి. అటువంటి శ్రీ చిలకమర్తి వేఱెవఱో వ్రాసిన పద్యాన్ని తన పద్యంగా చెలామణి చేయించుకొని లబ్ధిపొందాలనేంత నీచనికృష్ట మనస్తత్వమా శ్రీ చిలకమర్తి వారిది! తాను పద్యములు వ్రాయలేకనా? ఆనాటికే లక్ష ప్రతులు అమ్ముడుపోయిన గయోపాఖ్యాన మొకటి చాలదా ఆయన పద్య రచనా పాటవానికి తార్కాణము!

మఱి శ్రీ చిలకమర్తి వారికి ఇంత అప్రతిష్ఠ, ఇంత అపప్రథ ఎందుకు వచ్చింది? వారి స్వీయ చరిత్ర (విశాలంధ్ర ప్రచురణ) పేజీ 165 నందు

"...జనుల కోరిక ననుసరించి నేను పాలు గారి ఉపన్యాసములను వారు చెప్పనప్పుడే మనసులో ధారణము చేసుకొని వారి ఉపన్యాసాంతమున నొక్కటియు మరువకుండ సభా సదులకు తెలుగులో విన్నవించెడి వాడను. కట్టకడపటి దినమున సభలో కూర్చుండి నామనసులో యూహించుకొని యీ క్రింది పద్యమును బహిరంగముగ కట్టకడపట జదివితిని. "భరతఖండంబు... బిగయగట్టి..."అను యీ వాక్యములు ఇంత రాద్ధాంతమునకు కారణభూతములైనవి. ఇందుగల "... నా మనసున యూహించుకొని..."అను పదమును ఎవరికి వారు వారికి తోచినట్లు అర్థములను చెప్పుకొని మఱికొన్ని పదములను బ్రాకెట్లతో ప్రక్కన జేర్చుకొని, శ్రీ చిలకమర్తి వారిని నేరస్థునిగ చేయుచున్నారు. చేయడమేమిటి?... ఈ చిన్న పుస్తకములో వ్రాసిన వారందఱు శ్రీ చిలకమర్తిని దోషిగనే నిర్ధారించి దూషించిరి! ఒక్క శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు గారు మాత్రము "... ఇప్పుడు మనం చేయవలసినది సత్యాసత్యాలు తేల్చడమే..."అని మాత్రం లౌకికంగా తప్పుకొన్నారు.



ఈ పదానికి అర్థాన్ని స్థిరీకరించబోయే ముందు శ్రీ చిలకమర్తి వారి నాటి వాక్య నిర్మాణ విధానము, పదప్రయోగ వైచిత్రి తెలుసుకొనడానికి రెండు ఉదాహరణ లనిస్తాను.

***1. "బహిష్కరించుట" :*** ఈ పదానికి మనకు తెలిసిన అర్థం 'వెలివేయుట' కాని యీ పదాన్ని శ్రీ చిలకమర్తి గారు "ఆవిష్కరించుట" అన్న అర్థంలో ప్రయోగించారు. వారి స్వీయచరిత్ర పేజి 179లో "...వీరేశలింగం పంతులు గారు బాపయ్య గారి చిత్రపటమును సిద్ధము చేయించి రాజమహేంద్రవరపుర మందిరములో పెట్టించిరి. దీనిని **బహిష్కరించుట** కై గొప్పవారినెవరినైన బిలిపింతురని..." అని వ్రాసిరి. ఈ సందర్భమున బహిష్కరించుట అను పదమును వెలిబఱచుట (వెల్లడిచేయుట) అను అర్థములో వాడి పద సౌందర్యము అర్థ సౌలభ్యమును ఎంతో చక్కగా శ్రీ చిలకమర్తి వారు సాధించిరి. కాక 'వేలివేయుట' అను అర్థమునిచ్చు సందర్భమున – అదే పుస్తకము పేజీ 151లో శ్రీ టంగుటూరి ప్రకాశం గారి సీయయాత్ర అనంతరం ఇచ్చిన విందునకు పీఠాధిపతులు కోపగించినవారై "... ఆస్వాములవారు వెంటనే సీమ వెళ్ళి వచ్చినందులకు ప్రకాశం గారికిని, విందు చేసినందులకు చలపతి రావు గారికిని **వెలిపత్రిక** లు పంపి..." అని వ్రాసిరి. శ్రీ చిలకమర్తి వారి ఈ పద ప్రయోగ విధానాన్ని గమనించ ప్రార్థన.

**2. "బహూకరించుట" :** ఏదేనీ ఒక వస్తువును బహుమతిగా ఇవ్వడాన్ని బహూకరించుట అని మనకు తెలసిన అర్థం. శ్రీ చిలకమర్తి వారి యీ క్రింది ప్రయోగాన్ని చూడండి! అదే గ్రంథం పేజీ 175 లో "...నా చరమోపన్యాసము కూడా ప్రారంభోపన్యాసమువలెనే గంభీరముగ నున్నదని నా మిత్రులు నన్ను **బహూకరించిరి** ..." ఈ సందర్భమున బహుకరించుట అన్న పదానికి 'పొగడుట' అనే అర్థముతో శ్రీ చిలకమర్తి ప్రయోగించిరి. (అంటే బహుమానముగా మాటలను ఇచ్చుట అని భావార్థము) అట్లే పేజి 176లో "... రసికాభిలాషము శ్రీనాథుడు వ్రాసినది కాదనియు, నవీనులు వ్రాసినదనియు చెప్పి సత్యము కనిపెట్టి నందులకు వారాశ్చర్య పడుచు నన్ను **బహూకరించిరి** ..."

ఇది శ్రీ చిలకమర్తి వారి కాలంనాటి భాష, ప్రయోగ స్వరూపాలు! వ్యావహారికంగా ఏదో ఏదోగా అర్థాన్ని భావించవచ్చు కాని – ఆనాడు – ఆపదం – ఆ పదానికున్న నిజమైన అర్థం – ఆ పదానికున్న బరువు – ఇత్యాదులన్నీ పరిగణన లోనికి తీసికొని ప్రయోగింప బడుచుండేవి! ఇక ఈ సూత్రాలూ ఆధారంగా "ఊహ" అన్న పదాన్ని

విశ్లేషిద్దాం! నిఘంటువులు ఏం చెబుతున్నాయో, ఎవరు ఎట్లు ప్రయోగించారో పరిశీలించడాన్ని ముందుగా చేద్దాం!

**1. అమరకోశం : "అధ్యాహారస్తర్క ఊహః,"** అధ్యాహారము, తర్కము, ఊహము అనయీ మూడు పర్యాయపదాలు.

1. అధ్యాహారము అనగా లేనిదానిని ఊహించి తెల్పుట.
2. తర్కమనగా సంశయ భ్రాంతి జ్ఞానాదులను తరింప జేయునది.
3. ఊహ అనగా 'ఊహ్యతే అనే నేతి ఊహః అనగా దీనిచేత ఊహింపబడునది.

**2. శబ్దార్థ కల్పతరువు :** ఊహః అధ్యాహారం **"అపూర్వోత్ప్రేక్షణే ఊహః"** అనగా అపూర్వమైన అర్థమును ఉత్ప్రేక్షించునది; ఊహనే ఊహించుట, ఆరోపే ఆరోపించుట, పరీక్ష పరీక్షించుట.

**3. The Students New Sanskrit Dictionary :** Sanskrit - English. Complied by G.Vr. Deva Sthali; M.A.,; B.T., Zala Vedanta Prize man Printed by Keshav Bhikaji Dhawate, Bombay 1936 **ఊహ** to inter, to guess, **అనుక్త వ్యూహమితి పండితో జనః** to expect.

**4.సంస్కృతాంధ్ర నిఘంటువు :** శ్రీ వెత్సా వెంకట శేషయ్య ప్రాచీ పబ్లికేషన్స్.

ఊహ (పు) : వితర్కము, అధ్యాహారము.

**5. విశ్వకోశము :** ("ఊహ" ఇవ్వలేదు. వ్యూహ (వి+ఊహ) ఇచ్చారు. "వ్యూహస్తు బలవిన్యాసే నిర్మాణే బృంద తర్కయోః" పద్మశకటాద్యాకారముగా సైన్యమును రచించుట, ఊహించుట.

**6. శబ్దరత్నాకరము :** ఊహము : సం. వి.అ.పుం.

1. అపూర్వార్థము సుత్ప్రేక్షించుట, ఆరోపించుట.
2. లేని మాటలు కొన్ని తెచ్చుకొనుట.

**7. ఆంధ్రవాచస్పత్యము :** శబ్ద రత్నాకరము వలెనే

**8. సూర్యారాయాంధ్ర నిఘంటువు :** శబ్ద రత్నాకరము వలెనే

ఇవి నైఘంటికార్థాలు, ఏతావాతా "ఊహ" అనుదమునకు 'నూతన భావ ప్రతిపాదితమై, ఇంతవఱకు ఎక్కడా చెప్పబడినదై, అపూర్వార్థద్యోతకమై, ఉత్ప్రేక్షగా గాని, రూపకంగాగాని అర్థ స్వరూపమునందిచ్చు ప్రక్రియ"ను ఊహ అందుము. అనగా స్వంతముగా పద్యములల్లుట, పద్యములు రచించుట అను అర్థములు గావా!



ప్రక్కన బ్రాకెట్లలో (గుర్తుకు తెచ్చుకొని) (జ్ఞాపకము చేసుకొని) మొదలగు పదాల నుంచి పాఠకుని ప్రక్క త్రోవ పట్టించకపోతే "ఊహ" అను పదమునకుపైన చెప్పినదే అర్థము! 'ఇంచుక్ ప్రత్యయంతో' 'ఊహించు'గా రూపంచెంది ఆత్మనేపదార్థక్రియ అయిన "కొను" ధాతువు అను ప్రయుక్తమైతే "ఊహించుకొను" అను రూపం సాధింపబడుచున్నదిగా! ఇట్లే "రచించుకొను" అనికూడా! రచించుకొనుట అంటే భావం సులభంగా వ్యక్తం అగును. కాని ఊహించుకొను అంటే భావం అలంకారికంగా నిగూఢంగా వ్యక్తం అగును. ఇప్పుడు ప్రాచీన, మఱియు ఈ కవుల కాలంనాటి ప్రయోగాలు.

1. మార్కండేయపురాణం - 1వ ఆశ్వా. 148వ, ప, 149వ.వ.

148. "...................................... విద్యా లా
తత తీవార్తి భయంబునన్దలc కి యత్యంతంబు వాపోయెడిన్
ధృతి నీ **రాజును నోడకుండ**నుచు నేతెంచెం గతంబేమియో"
149. అని **యూహించి** ..........................."

2. ఇక శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తి గారి ప్రయోగం చూద్దాం.

"హలధరాచ్యుతుల తీర్థయాత్ర"లోని 74వ. తేటగీతి.

"అంత మూడవ దినమున నీతడు గుడి
ద్వారమును గాసి నెచ్చిలి, బట్టు **నూహ...."**

3. ఇక చిలకమర్తి వారు ఇతర సందర్భాలలోని ప్రయోగం, స్వీయచరిత్ర (విశాలాంధ్ర) మూడవపేజీలో

"... విశేషము గ దొంగలుండెడి యా కాలమున కంపెనీ వారి సరకులు, దొంగలు, బందిపోటులు, మొదలగు వారిపాల బడకుండ సేవకులు బురుజుల మీద నిలుచుండి కాపాడుట కేర్పడినవేమోయని నీ **యూహ..."**

ఇంత భావన - నూతనముగా తానాలోచించినదే - ఎవఱో చెబితే ఆయన మనస్సులోనికి వచ్చినది కాదు గదా!

ఇన్ని సందర్భాలలో ఎక్కడైనా "జ్ఞప్తికి తెచ్చుకొని" లేదా "ఇంతఃపూర్వ దానిని స్ఫురణకు తెచ్చుకొని, లేదా to recollect అను అర్థముగాని వస్తున్నదా?? ఇచ్చట 'నా మనసులో ఊహించుకొని' 'అనుటలో' లేని దానిని ఊహించి తెల్పుట-

అన్న భావన లేదా? 'అనుక్త వ్యూహమే' అన్న భావనరావడం లేదా, to gues
అన్న అర్థస్ఫురణలేదా, to inter అన్న అర్థం రావటం లేదా అంతే కాక గుర్తుక
తెచ్చుకొని, లేదా జ్ఞప్తికి తెచ్చుకొని, లేదా to recollect అనే అర్థం వస్తున్నదా?!
దయతో నిష్పాక్షికంగా ఆలోచించ ప్రార్థన. "నా మనసున యూహించుకొని"అన్న
ప్రయోగంలోని రూపక సమాసాన్ని ఉత్ప్రేక్షాలంకారాన్ని దయతో గమనించండి.

ఈ పద్యం చిలకమర్తి వారిదే శ్రీ భానుమూర్తి గారిది కాదు అని తీర్మానిం
నందువల్ల శ్రీ భానుమూర్తి గారి కీర్తి ప్రతిష్ఠలకు వచ్చే లోటు ఏమీలేదు. లేదా శ్రీ
భానుమూర్తి గారిదీ పద్యం అని అన్నా ఆయన గారికి కొత్తగా వచ్చిపడే గౌరవ
ఏమీ ఉండదు! శ్రీ భానుమూర్తి గారిది కాని పద్యాన్ని ఆయనకే అంటగట్టి ప్రచార
చేసినందవల్ల ప్రజల మనఃఫల కాలనుండి శ్రీ చిలకమర్తి గారిని తుడిచివేయడ
కూడా సాధ్యం అయ్యేది కాదు! ఇది శ్రీ భానుమూర్తి గారిదీ అనే జనశ్రుతుల
కూడా లేవు! "మా నాన్నగారు శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారు నాతో ఈ పద్యం
భానుమూర్తి గారిది అని నా చిన్నతనంలో అంటూ ఉండేవారు..." అని సభ
చెప్పిన శ్రీమతి కోలవెన్ను మలయవాసిని గారి ఏకగళశ్రుతి తప్పు! శ్రీ ఆంధ్ర శేషగి
రావు గారు సీనియర్ జర్నలిస్ట్ గదా! లబ్ధప్రతిష్ఠులు గద! కొన్ని పుస్తకాలు, కొ
వ్యాసాలు పుంఖాను పుంఖంగా వ్రాశారు! ఈ పద్యసంబంధమైన వివాదాన్ని ఎక్కడై
అక్షరబద్ధం చేశారా? శ్రీ చిలకమర్తి, శ్రీ భానుమూర్తి శ్రీ ఆంధ్రవారు సమకాలికుల
పరస్పర బహు పరియచస్థులు కూడా గదా! అక్షర బద్ధమైన సాక్ష్యం ఉన్నట్లైతే
చిలకమర్తి నిజస్వరూపం ఆధారబద్ధంగా తెలియగలిగేది కదా! నేలవిడిచిన సాము
ఎందుకు చేస్తున్నట్లు? పైగా శ్రీ చిలకమర్తి నిజాయితీని కూడా గుర్తించ నొల్లని
వ్రాతలు బాధను కలిగించవా? ఆయన మఱొకటి పద్యాన్ని ఉదహరించు సందర్భం
ఎంత నిజాయితీగా వ్రాసారో గమనించండి. శ్రీ చిలకమర్తి జీవిత చరిత్ర (విశాలాం
పేజీ 170లో "... ఆ సమయమున జ్ఞానవాసిష్ఠములోని ఈ క్రింది శ్లోకము జ్ఞప్తి
వచ్చెను.

"మనఃకృతం కృతం రామ, నశరీర కృతం కృతం – యేనైవాలింగితాకాంత
తేనైవాలింగితా సుతా" అని ఉదహరించారు. నిజంగా భరత ఖండంబు పద్యం
భానుమూర్తి గారిదే అయితే ఆయన గారిపట్ల శ్రీ చిలకమర్తి వారికి గల భక్తి గౌరవా
అంత అన్యాయాన్ని చేయనిస్తాయా??



ఈ సందర్భంలో భర్తృహరి రచించిన 'వాక్యపదీయం' లోని సూత్రాన్ని స్మరించడం తప్పుకాదను కుంటాను. "వాక్యం బుద్ధి అనుసంహృతిః" అంటాడు. అనగా 'వ్యక్తముగా ఉచ్చరించినపుడు ఉండు క్రమము స్థిరమైనది కాదు! కనుక అంతరాత్మ – అంతర్యామి అయి ప్రతి ప్రాణియందును ఉండు శబ్దతత్త్వము అక్షర చిహ్నములు లేకయే ఉన్నట్లుగాను, పదవిభాగము లేకయే ఉన్నట్లుగను బుద్ధిలో ఏర్పడును...." ఇప్పుడు ఈ దృష్టితో వ్రాసి, కన్న పదప్రయోగాల సందర్భాలను చూడండి! మఱి తేట తెల్లమైన అర్థముగల "ఊహించి" అన్న పదం వద్ద ఇంత సందిగ్ధత, ఇంత రాద్ధాంతం ఎందుకు చెప్పండి! 'వ్రాసి', 'కన్న' పద ప్రయోగాల సందర్భమున అంతక్లిష్టతకూడా లేదు గదా! ఇంతకీ ఈ విచారణ సారాంశము ఏమంటే "... భరతఖండంబు పద్యాన్ని పాల్‌గారి ఉపన్యాసానికి సద్యోఉత్తేజితుడై, ప్రేరణపొంది, అప్పటికప్పుడు మనసులో ఊహించుకొని అంటే రచించుకొని శ్రీ చిలకమర్తి వారు ఆ పద్యం చెప్పారని అంగీకరించవచ్చును గదా! దయతో సమీక్షకులను మఱో మారు సమీక్షించుకొనవలసినదిగా నా ప్రార్థన.

ఇక్కడ శ్రీ జయధీర్ తిరుమలరావు గారి దృష్టికి సోకనిది "కట్టకడపటి" అన్న పదం యొక్క పునరుక్తి! శ్రీ చిలకమర్తి తానుచేసే అనువాదాలలో తన స్వంత భావనలను జొప్పించలేదు. మొదటి 'కట్టకడపటి' పదం దినానికి విశేషణం, అయితే రెండవ 'కట్టకడపటి' పదం ముగింపు కాలానికి సూచకము! ఉపన్యాసం అంతా అయిపోయిన తరువాత కట్టకడపటిగా, చిట్ట చివరిగా (తనమాటలుగా) తాను ఈ పద్యాన్ని చెప్పానని శ్రీ చిలకమర్తి వారి భావనము గదా!

ఇక పద్యానికి పెట్టిన కొటేషన్ల విషయానికి వద్దాం! 'భరత ఖండం' పద్యం తన రచన (భానుమూర్తి) కాదు! అది అప్పటికే బహుళ ప్రచారం పొందింది – అదికూడా తనవల్ల కాదు! ఈ పద్యం తనకు స్ఫూర్తినిచ్చింది. ఈ పద్యం శ్రీ చిలకమర్తి గారిదని అందరికీ తెలిసిన విషయమే! రచయిత పేరు వేరే ప్రస్తావించనవసరం లేదు! అందుకు ప్రత్యామ్నాయంగా కొటేషన్లు పెడితే చాలు. అందులో సౌందర్యం ఉంది! కావ్య గాంభీర్యం ఉంది! అని శ్రీ భానుమూర్తి గారు భావించి ఉండవచ్చు.

అయినా 'భరత ఖండంబు' పద్యంలో ఉన్న శైలి మిగతా 27 పద్యాల్లో ఎందులోనూ లేదు! శైలి, శయ్యా, ప్రసాద, మాధుర్యాలకు ఆ పద్యమే అనన్వయం! "దుడుకుదనమున..." పద్యం అసలే మాత్రం పై పద్యంతో పోలదు! ఇది గునుగుగీతం' మొదటి పాదంలోని మిగులుతో రెండవపాదం ప్రారంభమౌతుంది! కాక ఈ పద్యంలో

అన్వయక్లిష్టత ఉంది! మొదటి పద్య భావానికి అనువుగా అర్థాన్ని కిట్టించాల్సి అవసరం ఉంది. భరత ఖండం లోని భావం తేటతెల్లం. ఈ పద్యం నిగూఢా భూయిష్ఠం! జాగ్రత్తగా ఈ రెండు పద్యాలను ఒక్కటికి రెండుసార్లు చదివితే అ భిన్నకర్తృకాలు అని, ఏకకర్తృకాలు కావనీ తేలికగా అర్థమౌతుంది! అసలా నక్ష మాలలోని అన్ని పద్యాలలోను 'భరతఖండంబు'లో ఉన్నంత మాధుర్యం లేద సాహసం చేసి మఱోమాట చెబుతాను – శ్రీ భానుమూర్తి గారి వృత్తాలు నడిచినం అందంగా, ఇంపుగా ఆయన వ్రాసినవే అయినా తేటగీతులు నడవవు! ఒక్కసా పోల్చి చూచుకొనవలసిందిగా సమీక్షకులకు నా మనవి! కాబట్టి ఈ శైలి వైరుధ్య కూడా కొటేషన్లకు కారణం కావచ్చు గదా! అదీ శ్రీ భానుమూర్తి గారి సంస్కార

ఇక్కడ మఱో విషయం పాఠకుల, సమీక్షకుల దృష్టికి తెస్తాను! భారతధ దర్శనం' పుస్తకం మన రాజమండ్రి గౌతమీ గ్రంథాలయాలలో లభ్యమౌతున్న పుస్తకం ఏమాత్రం శిథిలం కాలేదు. పూర్వము రాజమండ్రిలోగల 'సర్వజనపుస్త భాండాగారం' (PEOPLES LIBRARY) లో నెం. 414తో ప్రవేశించిన పుస్తకం, సదరు గ్రంథాలయం మన గౌతమీ గ్రంథాలయాలలో విలీనం అయినప్పు ఆనాటి కేటలాగులో నెం. 336తో చేరి, వర్గీకరణం అనంతరం "తె.సా. భార.నెం.20574 తో స్థానమును పొందినది. తప్పొప్పుల పట్టిక గూడా స్పష్టము సంపూర్ణముగా అందు ఇమిడి యున్నది. ఇందు ఆశ్చర్యకరమైన విషయం ఏమన 'సర్వజన పుస్తక భాండాగారం' లిస్టునందుగాని, లేదా గౌతమీ గ్రంథాలయం పా లిస్టునందుగాని, లేదా వర్గీకరణం అనంతరం తయారయిన సరిక్రొత్తలిస్టునందుగా రచయిత పేరు వ్రాయవలసిన చోట ఎవరి పేరును వ్రాయబడి ఉండలేదు. ఇచ్చ పాతలిస్టు, తెలుగు టైపు అక్షరములది! రచయితగా ఎవరిపేరును టైపు చేయబ ఉండలేదు. మరి కుముదవల్లి గ్రామములోని గ్రంథాలయములో రచయిత పేరు శ్రీ చెన్నాప్రెగడ భానుమూర్తి గారి పేరు చేత్తో వ్రాయబడి ఉన్నదని శ్రీ సుబ్బారా గారు వ్రాశారు. (డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారి పరిశోధనా కాలం నాటి మఱి ఎవఱు వ్రాశారో?? అందులకు ఆధారములేమిటో? పరిశీలించాల్సిన అవస ఉంది! డా॥ కొత్తపల్లి వారి త్రోవలో డా॥ సినారె గారు నడిచారు! ఇక శివశం స్వామి గారంటారా? గౌరవనీయులు పోతుకూచి సూర్యనారాయణ మూర్తి గా తాము సంకలనం చేసిన 'భానుమూర్తి కావ్య కుసుమాంజలి' ప్రతి ద్వారా శివశంకర స్వామి గార్నిప్రక్క త్రోవకు నడిపించారు. రాజమండ్రిలో లేని రచయి



సరు కుముదవల్లిలో ఎట్లా ప్రవేశించిందో ప్రచురణకు ముందు గౌరవనీయులు శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తి గారు ఆలోచించవద్దా? ఇక డా॥ కొత్తపల్లి వారంటారా – వారి పరిశోధనాంశం "పద్య కర్తృత్వ విచారణం" కాదు కదా. ఆ దృష్టితో ఆలోచించాల్సిన అవసరం ఆయనకు లేదు. రచయిత ఎవరన్నది కాదు – ఆంగ్ల భాషా ప్రభావానికి లోనైన రచనమా – కాదా అనేదే ఆయనగారి దృష్టి కదా.

భారతధర్మ దర్శనంలో భరతఖండంబు పద్యానికి ఉన్న "క" అను అక్షరాన్ని శ్రీ కరణం సుబ్బారావు గారు తొలగించారు! మఱి తప్పొప్పుల పట్టికలో అది తప్పుగా చూపించబడి లేదు గదా! (వారికి దొరికిన పుస్తకంలో తప్పొప్పుల పట్టిక పూర్తిగా లేదుట! ఒక పేజీకి ఇరువైపుల ముద్రించబడిన పట్టిక పూర్తిగా లేకపోవడం ఎలా సంభవం – పోతే ఆ పేజీ అంతా లేకపోవాలిగాని–) తప్పొప్పుల పట్టికలో చూపనప్పుడు సరిదిద్దడానికి మనం ఎవరం? నాకు దొరికిన పుస్తకంలో తప్పొప్పుల పట్టిక పూర్తిగా ఉంది! అందులో ఆ పద్యం ఉన్న పేజీలో (పేజీ 14లో) 17 వ లైనులో 'సన్ననూలును' అన్నది తప్పుగాను, 'సన్ననూలున' అన్నది ఒప్పుగాను సూచించబడి ఉంది! అంతేగాని "క" యొక్క ప్రస్తావనేమీ లేదు! మఱి శ్రీ సుబ్బారావు గారు "క" ను మార్చి "గీ" గా ఎందుకు ముద్రించినట్లు? పై పెచ్చు వీరు ఆ పద్యములకు వరుస సంఖ్య వేశారు! నాకు దొరికిన ప్రతిలో ఏ శీర్షికలోన వరుస సంఖ్యలు లేవు! మఱి శ్రీ పోతుకూచి వారు వారు సమాదరించిన "భానుమూర్తి కావ్య కుసుమాంజలి'లోని పేజీ 236లో వరుస సంఖ్యలు వేయడం వలన వారిని చూచి శ్రీ సుబ్బారావు గారు వరుస సంఖ్యలు వేశారు. శ్రీ సుబ్బారావు గారు గ్రంథాలయంలోని అసలు ప్రతిని చూచి ఉండలేదన్నమాట (అసలు ప్రతిలోని ఆ పేజీ యొక్క ఫోటో కాపీని ఇందులో జతపరచుచున్నాము దయచేసి గమనించండి). మఱి "క" అను అక్షరాన్ని శ్రీ వేమవరపు రామదాసు గారు 1907లో ముంద్రించిన పుస్తకంలో ఏ అభిప్రాయంతో ఉంచారో సుంత యోచించవలదా? మన బుద్ధికి తోచినదే తడవుగా (శ్రీ పోతుకూచి వారు, శ్రీ సుబ్బారావు గారు దయతో నన్ను క్షమించండి) తొలగించడమేనా? నా బుద్ధికి తోచిన అభిప్రాయాన్ని వివరిస్తాను! అది నిజం కావచ్చు, కాకపోవచ్చు! ఇది నా ఊహ మాత్రమే! (చూచారా! ఇక్కడ 'ఊహ' శబ్దం గతంలేని భావాన్ని వ్యక్తం చేస్తున్నాననే అర్థాన్నిస్తోంది.) శ్రీ చెన్నాప్రెగడ వారు తమ బాల్య మిత్రుడైన శ్రీ చిలకమర్తి వారిపైగల వాత్సల్యం, గౌరవంతో ఆయన పద్యాన్ని తన పద్యంగా చెలామణి చేసుకోవాలనే దుర్బుద్ధిలేనివారై

“కలుపబడినవి” అను నిగూఢ భావనకి సంకేతపదంగా “క”అను అక్షరాన్ని
శ్రీ చెన్నా ప్రెగడ వారు తమ సంస్కారాన్ని, ఔన్నత్యాన్ని ప్రదర్శించుకొన్నారని
అనుకూల్య దృక్పథంతో (Posite Atitude) ఎందుకు భావించకూడదు? ఇ
పట్ల మనం సరి అయిన గౌరవం చూపించిన వారం అగుట లేదా? (ఇది ని
కావచ్చు, కాకపోవచ్చు, కాని తప్పు మాత్రం కాదు గదా!) ‘శ్రీ చిలకమర్తి దొ
అనే ముందస్తు స్థిరభావనంతో కాకుండా ఆలోచించవలసిందిగా అందటికీ
వినయపూర్వక వినతి! ఇందుకు ఆధారం ఆ నక్షత్రమాల పద్యాలు 1907 ఏప్రి
పూర్వం ఎక్కడా ఏపత్రికలోను ప్రచురింపబడి ఉండలేదు. గనుక! ఆ పద్యాల
చూస్తే అవి భిన్నకర్తృకాలని అన్పిస్తున్నది గనుక!

ఇక్కడే మరొక విషయం ప్రస్తావిస్తాను శ్రీ సుబ్బారావుగారు మూలం
‘పిదుకు’ అని ఉన్నది. దానిని ‘పితుకు’గా మార్చానని వ్రాశారు! ఎందుకు మార్చారు
‘పితుకు’ అని ఉన్న ‘పిదుకు’ అని ఉన్నా గణభంగంగాని యతి భంగంగాని కాదు
మతి ఈ జాగ్రత్త తీసుకున్నవారు, వారి పుస్తకంలోనే, అదే శీర్షికలోని 8వ పద్య
“ముతుకబట్టలు ధరియించి హృదయమునను” అన్న పాదంలో యతిభం
కాలేదా?? శ్రీ చెన్నాప్రెగడ అంతటివారు యతిభంగం చేస్తారా? అక్కడ ‘ముతు
గాదు ‘ముదుక’ అని ఉండాలి! అప్పుడు యతి సరిపోతుంది! శ్రీ సుబ్బారావు
తోచలేదా? (“ముదక” అన్నది సాధుప్రయోగం – భానుమూర్తి కావ్యకుసుమాం
లో పేజీ 238లో వుంది. అది వేరు విషయం.)

శ్రీ సుబ్బారావు గారు 16వ పేజీలో “...ఈ పద్యం గుఱించి పోలీ
చిలకమర్తి వారిని విచారించారట. అయితే ఆ ‘<u>సహజకవి</u>’ సమయస్ఫూర్తితో “
తెల్లవారను గడుసరి గొల్లవారు”అని చదువలేదు. తెల్లవారున గడుసరి గొల్ల
అని చదివాను. అందులో తప్పేముంది?” అని <u>అద్దం తిరిగాడట...”</u> అని వ్రా
నిజానికి అట్లు గడుసరిగా సమాధానం చెప్పినది శ్రీ చిలకమర్తి వారు కా
మధునాపంతుల వారి ఆంధ్ర రచయితలు గ్రంథం పేజీ 235లో “... నాడు క
నాళ్ళీ గీతము చదువని వారు లేరు. భోగరాజు పట్టాభి సీతారామయ్య గా
తెల్లవారను = తెల్లవారఁగా అను అర్థము చెప్పి ప్రభుత్వమునోదార్చిరి. అ
వీరిపేరు మాఱుమ్రోగినది...” అని వ్రాసారు. నిజం ఈ విధంగా ఉండగా
సుబ్బారావు గారు ఏమాత్రం పరిశీలన చేయకుండా చిలకమర్తి వారిపై క
కక్షగా, ఏకపక్షబుద్ధితో (సహజకవి, అద్దం తిరగాడట అంటూ) నిప్పులు క



న్యాయమా? శ్రీ సుబ్బారావు గారి ఆక్రోశాన్ని ప్రస్తుతించిన “సో కాల్డ్ పరిశోధక పర్యవేక్షకులు” (పరిశోధన పర్యవేక్షకమ్మన్యుల) తబలా వాయించడం వారి స్థాయికి తగినదేనా? న్యాయమేనా?

ఈ పద్యం భారత జాతీయోద్యమ సంబంధమైన తొలి రచన అని చెప్పవచ్చును” అన్న నారాయణరెడ్డి గారి మాటలు కొంతవఱకే నిజమని డా॥ మొదలి నాగ భూషణ శర్మ గారు అన్నారు. శర్మ గారి ఈ కామెంట్‌ను తీగలా పట్టుకొని లాగితే డొంకంతా కదిలింది. అసలీ పద్యం చిలకమర్తి వారు వ్రాసింది కాదని తేలింది...” అని శ్రీ సుబ్బారావు గారు పేజీ 4లో వ్రాశారు. డా॥ మొదలి వారు ఏ సందర్భంలో అన్నారో చూద్దాం. “...కొంత వరకే నిజం. ఎందువలనంటే 1897-98 మధ్య కాలంలో సరస్వతి మొదలైన పత్రికలలో భారత దేశపు స్థితి గతులను గూర్చి అశేషమైన ఖండికలు వెలువడ్డాయి. ఇవి యేవీ పుస్తక రూపంగా రాలేదు. అయితే మనోరమ పత్రిక వచ్చినప్పటి నుంచి పత్రికలలో ఎక్కువగా...” ఇదీ డా॥ మొదలి వారు వ్రాసిన వాక్యాలు. ఇందులో చిలకమర్తి వారి రచన కాదేమో అనే సందేహాస్పదద్యోతక భావం ఏమైనా ఉందా? ఈ సందర్భాన్ని శ్రీ సుబ్బారావు గారు వక్రీకరించలేదందామా?

ఇక నక్షత్రమాల విషయానికి వద్దాం! 28 పద్యాలు ఉండటాన్ని శ్రీ సుబ్బారావు గారు ‘అభిజిత్’ నక్షత్రాన్ని అడ్డం పెట్టుకొని సమర్థించుకొన ప్రయత్నించారు. నిజానికి అభిజిత్ గురించిన వివరాలు శ్రీ సుబ్బారావుగార్కి తెలియవు? పూర్వగాథాలహరిలో, విద్యార్థి కల్పతరువులో ఉన్న వాటిని చదివి వాదించడం 7వ సూత్రంలో ప్రథమమంత్రంగా దానిని వర్ణించారు. అట్లే తైత్తరీయ బ్రాహ్మణం 1-5-1లో అభిజిత్‌ను నక్షత్రంగా స్పృశించారు. కాని అది నక్షత్రంకాదు. కాలక్రమేణ అది లుప్తమైపోయింది! ఆకాశమార్గంలో దాని ఆకారం లేదు. పరిశోధనలు జరిపిన కార్తాంతికులు దానిని నక్షత్రంగా స్వీకరించలేదు. జ్యోతిశాస్త్రంలో నక్షత్రాలకు, తారలకు వేర్వేరు వర్ణనలున్నాయి! అంటే నక్షత్రం వేరు, తారలు వేరన్నమాట! నక్షత్రతారగ్రహసంకులాపి, జ్యోతిష్మతీ చంద్రమసైవరాత్రిః’ అని ఇందుమతీ స్వయంవర ఘట్టంలో పరంతపరాజునుగుఱించి కాళిదాసు వర్ణిస్తాడు.

నక్షత్రం అంటే తారలసముదాయం! "నక్షత్రాణాం తారకామయత్వం"
జ్యోతిశాస్త్రం చెబుతోంది! అని మూడు తారలకలయిక గల త్రికోణకార
ఇచ్చినప్పటికినీ నక్షత్రగణం నుండి తొలగించారు. ఎందుకంటే "... అత్ర అభి
ఉత్తరాషాఢాయాం అంతర్భవాత్ పృధుగుక్తిః నభవతీతి జ్ఞేయం..." అంటూ
జ్యోతిషంలోని అధర్వణ జ్యోతిషభాగం చెబుతోంది! అంటే ఉత్తరాషాఢా నక్షత్ర
అంతర్భాగంగా రూపాంతరం చెందిన కారణంగా అభిజిత్‌ను నక్షత్రంగా ప్రత్యేక
పేరుగా చెప్పబడుటలేదు అని అర్థం. కాబట్టి అభిజిత్ నక్షత్రం కాదు.
సమాచారాన్ని అందించిన గురుదేవులు బ్రా॥శ్రీ॥ మధుర కృష్ణమూర్తి శాస్త్రి
కృతజ్ఞతలతో పాదాభివందనాలు). కావున సుబ్బారావు గారూ అభిజిత్ నక్ష
కాదు. ఈ భావానికి అనుబంధంగా ఈ క్రింది మూడు ప్రశ్నలను మీదృష్టికి తెస్తా

1) రాశులు 12గదా! ఒక్కొక్కరాశికి 9 పాదాలుగదా! మొత్తం పాదాలు 1
అవుతున్నాయి గదా! ఈ 108 పాదాలను 27 నక్షత్రాలతోనే నింపారు! ఒక
నక్షత్రానికి 4 పాదాలు చొప్పున 27 × 4=108 పాదాలు అవుతున్నాయి
వరుసక్రమంలో అభిజిత్ ఎక్కడ?

1 మూల పూర్వాషాఢా ఉత్తరాషాడాః పాదం ధనుస్సు.

2. ఉత్తరాషాఢాస్త్రయో శ్రవణధనిష్ఠార్థం మకరం.

మరి ఇక్కడ అభిజిత్ ఉత్తరాషాఢ మరియు శ్రవణానక్షత్రాల
ఉండాలిగదా? లేదేం? అభిజిత్‌తో కూడా కలిపితే 28×4=112 పాద
అవుతున్నాయి గదా! మరిమొత్తం పాదాలు 108 గదా!

2) దశాంతర్దశలు ఉన్నాయి. అందులో అభిజిత్ ఉందా?

1. కృత్తికోత్తర ఉత్తరాషాఢసూర్యమహర్దశ - 6 ఏండ్లు.

2. రోహిణీ హస్త శ్రవణం చంద్రమహర్దశ - 10 ఏండ్లు.

మరి ఇచ్చట అభిజిత్ ఏగ్రహదశాంతర్దశలలోనికి వస్తుంది?

3) మరీ అతిసామాన్యమైన ప్రశ్న వేస్తాను - ఆలోచించండి! 'నేను అభిజి
పుట్టాను' అని ఎవడైనా తన జన్మనక్షత్రాన్ని అభిజిత్‌గా చెప్పుకొనేవాడు
భూమండలంలో ఉన్నాడా? చూ.చే.చో ల అశ్వనివలె అభిజిత్‌నకు" నామ న
రాశి గణచక్రంలో చోటు ఉందా సుబ్బారావుగారూ! అభిజిత్ వెనుక ఇంత చ



ంది! కాబట్టి నక్షత్రమాల అంటే 27 పద్యాలే వ్రాయాలి! 'తారావళి' అంటే ఎన్నైనా
ాయవచ్చు ఎందుకని అంటే - ఆకాశంలో తారలు అనంతాలు గనుక!

పూర్వ కవులు ఎవరయినా ఉపోద్ఘాత, మంగళాస్పద పద్యాలు కాకుండా
లం నక్షత్రమాలగా 27 పద్యాలకు మించి వ్రాసారా?

శ్రీ చెన్నాప్రెగడ వారికి ఈ నియమం తెలుసు కనుకనే తనవిగా 27
ద్యాలనే వ్రాశారు! తనకు స్ఫూర్తినిచ్చిన పద్యం శ్రీ చిలకమర్తి వారిది గనుక
నిని కొటేషన్లలో పెట్టి మకుటంగా చూపారు. దయతో మరొకసారి ఆలోచించండి.
ందరు విశ్వసించారుగనుకనే ఆ పద్యం చిలకమర్తి వారిదే అని డా॥ కొత్తపల్లి,
॥ సి.నా.రె. ప్రభృతులేకాక సమస్త సాహితీ జగత్తు శ్రీ చిలకమర్తిని ప్రస్తుతించింది.
ప్పుడు చెప్పండి శ్రీ కరణం సుబ్బారావుగారు ఆపద్యం శ్రీ చిలకమర్తి వారిదే అని
రుకూడా అంగీకరిస్తారా?

ఈ పుస్తకానికి ముందు మాటలు వ్రాసిన, ఆమోదాలను తెలిపిన పరిశోధక
ర్యవేక్షక, శిఖామణులారా - మీ స్థాయిని గూర్చి మీరే యోచించుకొనవలసినదిగా
వినయ పూర్వక విజ్ఞప్తి ఇదే పుస్తకంలో డా॥ యస్.వి. సత్యనారాయణ గారు
న్న "తెలుగు పరిశోధకుల డొల్ల తనాన్ని గొట్టిదాటు తత్త్వాన్ని..." అనే మాటలు
వంటి వారి కారణాన అక్షర సత్యాలు అవుతున్నవని ఈ పుస్తకంలోని వాదనకు
మీ ప్రశంసలను పరిశీలించిన మా వంటి వారు భావించడంలో తప్పు
దంటారా? మీరు అధిష్టించిన పీఠానికున్న స్థాయిని, గౌరవాన్ని మీరేమాత్రం
రిరక్షిస్తున్నారో సుంత ఆత్మశోధన చేసుకోవలసిందిగా వినయపూర్వకంగా మరీ
రీ విన్నపం చేస్తున్నాం.

చివరగా భర్తృహరి వ్రాసిన వాక్యపదీయంలోని ఈ శ్లోకంతో ముగిస్తాను.

ప్రజ్ఞా వివేకం లభతే, భిన్నైః ఆగమదర్శనే,

కియద్వా శక్యమున్నేతుం, స్వతర్కమనుధావతా!!

అంటే వివిధములైన శాస్త్రములను, గ్రంథములను అధ్యయనం చేయువ్యక్తి
యొక్క బుద్ధి వికసిస్తుంది. ప్రజ్ఞా మరియు వివేకం అతనికి వస్తుంది! కాని విస్తృత
ంథాధ్యయనంలేక, కేవలము తనబుద్ధిని మాత్రమే అవలంబించి విషయములను
గ్రహించు వ్యక్తి పరిపూర్ణ జ్ఞానమును ఎన్నటికీ పొందలేడు!

# ఆ పద్యం చిలకమర్తిదే - ఇది చారిత్రక సత్య

- పెరుమాళ్ళ రఘు

దీ 07-09-09వ తేదీ సోమవారం "అక్షరం"సూర్య హైదరాబా
శ్రీకరణం సుబ్బారావుగారు వ్రాసిన "ఆ 'పాడియావు' చిలకమర్తిది కాదు"
వ్యాసానికి ప్రతిస్పందనమిది! ఆ వ్యాసంలో సుబ్బారావుగారి పుస్తకాన్ని,
రంగనాయకమ్మగారి పుస్తకాన్ని పరిచయం చేశారు. రంగనాయకమ్మగారి పుస్తకం
ఒక అంశాన్ని (సుబ్బారావు గారి పొరబాటు)ను కూడా పరిచయం చేశారు!
సుబ్బారావుగారు తమ వ్యాసంలో రంగనాయకమ్మ గారి ప్రస్తావనమే లేదు
మరి బాక్స్‌లో వ్రాసిన వాక్యాలు సంపాదకులువా? అలా అని క్రింద "సంపాదకు
అని కూడా బాక్సులో పేర్కొనబడలేదు. కాబట్టి ఆ పరిచయ వాక్యాలు క
సుబ్బారావుగారివే గదా! తన తప్పును ఎత్తిపొడిచిన అంశాన్ని
ఉదహరించుకొన్నారు కాని సుబ్బారావుగారు దానిని ఖండించ లేదేమి???

ఇక సుబ్బారావుగారు వ్రాసిన అంశాల గురించి చూస్తే - వారు ప్రచురిం
ఆ పుస్తకంలోని అంశాలనే సుబ్బారావు గారు మరలా ఈ వ్యాసంలో పేర్కొన్నా
కాని వారు సూచించిన ఈ అంశాలనన్నిటిని రంగనాయకమ్మగారు తమ పుస్తక
ఆధారాలు లేనివిగా, ఊహజనితాలుగా, అవిశ్వసనీయాలుగా కొట్టిపారే
సుబ్బారావుగారు తన పుస్తకంలో తాను వ్రాసుకొన్న వాటినే తిరిగి తిరిగి చెప్పుకుం
పోతే ఉపయోగం ఏమిటి? (ఇది హిట్లరు కాలం కాదే - పదిసార్లు చెప్పిన అ
నిజంగా మారిపోవడానికి. బ్రాహ్మణుడు - మేక - నలుగురు దొంగలు -
కాలం కూడా కాదే!) సుబ్బారావుగారు చెప్పిన ప్రతి అంశాన్ని ఆధారరహిత
రంగనాయకమ్మ గారు సోదాహరణంగా తేల్చారు!

మరి సుబ్బారావుగారు ఆమె వాదనను ఎందుకు ఖండించలేదు! పున
చేసారు తప్ప - వారి వాదం వీగిపోయిందని నిరుత్సాహ పడ్డారని భావిద్దా
వారి వాదాన్ని ఆకాశానికెత్తిన ఆయన వందిమాగధులు తొమ్మిది మంది జవా
ఇవ్వలేదేమి? పది మంది గొప్ప వాళ్ళ పేర్లు ఉటంకిస్తే - వారు ఉదహరిం
దానిని వక్రీకరిస్తే పరిశోధన అవుతుందా? పెద్ద పెద్ద డిగ్రీల వారని - పరిశో
పర్యవేక్షకులని - చెప్పి (కాని వారిని కూడా) పాఠకుడిని బెదరగొట్టే ప్రక్రియ క
ఇది.

23-15-3/2/1, సుభాష్‌నగర్, కోరుకొండ రోడ్, రాజమహేంద్రి - 533 10



శ్రీ సుబ్బారావుగారి పుస్తకాన్ని, అందువారు ఉదహరించిన అందలి వ్యాసాలను, దివాన్‌చెఱువు శర్మగారు వ్రాసిన సమాధానాన్ని, అందుకు శ్రీ సుబ్బారావుగారు వ్రాసిన సమాధానాన్ని (సమాధానమొకటి) ప్రజాపత్రిక ఎడిటర్ శ్రీ సుదర్శనం గారికి వ్రాసిన శ్రీసుబ్బారావు గారి ఉత్తరాన్ని (సమాధానం రెండు) చివరగా రంగనాయకమ్మగారి పుస్తకాన్ని పరిశీలించాను! అట్లే సూర్య పత్రికలోని వ్యాసాన్ని (సమాధానం మూడు) కూడా చదివి ఇది వ్రాస్తున్నాను. ఆయన ఆధారం చేసుకున్న ఆకరాలనన్నింటినీ రంగనాయకమ్మగారు దూదిపింజల్లా ఎగరగొట్టారు. నేను కూడా నా శక్తిమేరకు సుబ్బారావు గారి వాదాన్ని నిరస్తం చేసే ప్రయత్నం చేస్తాను!

(ముందుగా నా పరిచయం! నేను చిలకమర్తి వారి తమ్ముడు కృష్ణమూర్తి గారికి సాక్షాత్తూ దౌహిత్రుడను! రాజమండ్రిలో "చిలకమర్తి ఫౌండేషన్" స్థాపించి దానికి కార్యదర్శిగా వ్యవహరిస్తున్నాను! రంగనాయకమ్మ దివాన్ చెఱువు శర్మ మొదలగు వారలది సామాజిక బాధ్యత అయితే నాది అదనంగా ఏక రక్త బాధ్యత కూడా)

ముందుగా శ్రీ ఎస్.వి.ఎస్. ప్రసాదుగారు 'ది జర్నల్ ఆఫ్ తెలుగు లిటరేచర్' జూలై 1988 పత్రికలోని వ్యాసాన్ని పరిశీలిద్దాం! పేజీ 169లో శ్రీ ప్రసాద్ గారు "…. కాబట్టి ఈ పద్యం చిలకమర్తిదా? లేక భానుమూర్తిగారు రచించినదా? అనే విషయాన్ని గూర్చి పెద్దలు తమ అభిప్రాయాన్ని తెలుపగలరని ఆశిస్తూ అభ్యర్థిస్తున్నాను…" అంటూ ముగించారు! ఇప్పుడు చెప్పండి శ్రీ ప్రసాద్‌గారు పద్యం చిలకమర్తివారిది కాదని నిర్ధారణ చేశారా? నిర్ధారణ చేసినట్లుగా శ్రీ సుబ్బారావుగారు తమ పుస్తకంలో ఏడవ తేదీ నాటి సూర్య పత్రికలో వ్రాశారు. పుస్తకానికి ముందు మాట వ్రాసిన గొప్ప గొప్ప పరిశోధక పర్యవేక్షకులు సెబాస్ సెబాస్ అని మద్దెల మ్రోగించారు! పైగా ప్రసాద్‌గారు హిందీ విభాగంలో పరిశోధన విద్యార్థి! హిందీలో మైథిలి శరణ్ గుప్త రచించిన "భారత్-భారతి"ని చెన్నా ప్రెగడ తెలుగులోనికి అనువదించారని పోల్చి చూపుతూ మధ్యలో "భరతఖండంబు" పద్యాన్ని ప్రస్తావించి, తాను తన ఊహను జోడించి - సందేహం వెలిబుచ్చిన వ్యాసమిది! దీనిని చూపి సుబ్బారావుగారు మన కళ్ళకు గంతలు కట్టేస్తున్నారు. సుబ్బారావుగారు ఉదహరించిన శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు, డా॥ సి.నా.రె. ప్రభృతులు అందరూ, అంతే కాక సర్వప్రజానీకము ఆ పద్యం చిలకమర్తి వారిదే అని నిర్ధారణగా విశ్వసించారు గనుక - అంతగా అందఱూ స్పందించారు! వారందఱూ శ్రీ సుబ్బారావుగారి దృష్టిలో, వందిమాగధుల దృష్టిలో దోషులే! అందరూ కలసి

చిలకమర్తివారిని ఎన్నెన్ని మాటలన్నారో, ఎంత నేరస్థుడుగా, దోషిగా దూషించా
కాని 1907లో ప్రచురింపబడిన "భారతధర్మ దర్శనము"లోని పద్యాలను ఉన్న
ఉన్నట్లుగా గాక తమ అత్యుత్సాహాన్ని ప్రదర్శించి – తమకు అనుకూలమైన మార్పుల
1959లో "భానుమూర్తి కావ్య కుసుమాంజలి"ని ముద్రించిన శ్రీ పోతుకు
సూర్యనారాయణ మూర్తి గారు మాత్రం శ్రీ సుబ్బారావుగారి దృష్టిలో, వందిమాగధ
దృష్టిలో కడువందనీయులు! వ్యక్తిగా శ్రీ పోతుకూచి వారు మాకు అందఱికీ గౌరవనీయు
కాని ఈ పుస్తకం విషయంలో మాత్రం అందఱినీ తప్పు తోవపట్టించిన అత్యుత్సాహం
శ్రీ పోతుకూచివారి ఉత్సాహాన్ని రంగనాయకమ్మగారు తూర్పార పట్టారు! అందు
ఎవరూ రంగనాయకమ్మగారికి జవాబు ఇవ్వలేకపోయారేం! సుబ్బారావుగార్కి కూ
రంగనాయకమ్మ గారి పుస్తకం చదివిన తరువాత దిక్కుతోచక, చెప్పిందే చెప్ప
ప్రారంభించారు! రంగనాయకమ్మగారి ప్రశ్నలకే గాదు, దివాన్ చెఱువు శర్మగారి ప్రశ్నల
కూడా – ఎవ్వరూ ఇంతవఱకూ నోరు మెదపలేదు! కారణం??

ఇక "ఊహించుట" అన్న పదానికున్న అర్థం విషయంలో శ్రీ శర్మగా
ఎనిమిది నిఘంటువుల, ఇద్దరు ప్రసిద్ధ కవుల ప్రయోగాలను, అట్లే చిలకమర్తిగా
విభిన్న ప్రయోగాలను వ్రాస్తూ ఆ కాపీలను ఈపై తొమ్మిది మంది పెద్దలకి పంపా
"ఊహించుట" అన్న శబ్దానికి "గుర్తుకు తెచ్చుకొనుట" అను అర్థంలో ఏ క
అయినా ప్రయోగించాడా – చూపించండి – అని అందులో శ్రీ శర్మగారు అందఱి
అభ్యర్థించారు! లేని అర్థాన్ని కల్పించి, తమకు తాము ఊహించుకొని
వందిమాగధులను తోడు తెచ్చుకొని – సాహిత్యాభిలాషులను శ్రీ సుబ్బారావుగా
గందరగోళపరుస్తున్నారని శర్మగారు వాపోయారు! అలా కాదు – శర్మగారూ –
నిఘంటువులో "గుర్తుకు తెచ్చుకొని" అనే అర్థం ఉంది. ఇదిగో ఈ కవి ప్రయోగం
"గుర్తు తెచ్చుకొని" అనే అర్థస్ఫురణ ఉంది – అని సుబ్బారావుగారు గాని, 'తొమ్మి
మంది పెద్దలలో ఏ ఒక్కరు గాని శ్రీ శర్మగార్కి ఈనాటి వఱకు జవాబు వ్రాయలేద
పదానికి స్వతహాగా వచ్చే అర్థాన్ని స్వీకరించాలి, లేదా భర్తృహరి ప్రయోగాని
లోబడిన అర్థాన్ని స్వీకరించాలి గాని, మన ఇష్టం వచ్చినట్లుగా పదానికి మన
అర్థం ఊహించుకొని, చిలకమర్తిని దోషిని జేసి మాట జారడం న్యాయమా? ఇదే
పరిశోధన పర్యవేక్షకుల, శాఖాధిపతుల సభ్యత!! సుబ్బారావుగారి పుస్తకం చదివి
తరువాత ఈ పద్యం భానుమూర్తిగారిదంటూ ప్రచారం చేయండి అంటూ
వుయ్యూరు లక్ష్మీనరసింహారావు గారు చిలకమర్తి అభిమానులకు (డోలు



ఢమరుకాలతో ఊరూరా తిరగండని) ఒక బృహత్తర కార్యక్రమాన్ని, డ్యూటీని నిర్దేశించారు! ఇదేం న్యాయమండీ!

ఇక కొటేషన్ల విషయానికి వద్దాం! ఒరిజినల్ భారత ధర్మ దర్శనం బుక్కులో ఒక్క "భరతఖండంబు" పద్యానికి కొటేషన్సు ఉన్నాయి! శ్రీ పోతుకూచి వారి వద్ద నున్న వ్రాత ప్రతిలో కూడా ఆ పద్యానికి ఒక్కదానికే కొటేషన్లు ఉన్నాయి! కాని శ్రీ పోతుకూచి వారు అత్యుత్సాహంతో 1959లో తాము ముద్రించిన భానుమూర్తి కావ్యకుసుమాంజలిలో కొటేషన్లు తీసేశారు. 1907 నాటి ప్రతిలో, వ్రాత ప్రతిలో వరుస సంఖ్యలు లేవు. కాని శ్రీ పోతుకూచివారు భరతఖండంబు తో కలుపుకొని వరుస సంఖ్యలను వేశారు. ఇక ఆ పుస్తకం చూచి మన వాళ్ళందఱూ రెచ్చిపోయారు! అందులో ఉన్న కొటేషన్లు మీరెందుకు తీసేశారు అని గాని, అందులో లేని వరుస సంఖ్యలు మీరెందుకు వేశారు అని కాని శ్రీ పోతుకూచి వారిని ఒక్కరైనా అడిగితే ఒట్టు! కొటేషన్లు విషయమై శ్రీ సుబ్బారావు గారు, శ్రీ శర్మగార్కి వ్రాసిన సమాధానంలో "డేవిడ్ గ్రీన్" గారిదంటూ "The inversions helps to emphasize his confidance and optimism...." ఒక నిర్వచనాన్ని ఉదహరించారు! ఈ సందర్భంగా కళాపూర్ణోదయంలోని, పాండురంగ మహాత్మ్యంలోని రెండు ఘట్టాలను శ్రీ సుబ్బారావుగారు ఉదహరించారు! ఆ రెండు ఘట్టాలు పై నిర్వచనానికి సరిగ్గా సరిపోతాయి! ఆ రెండు ఘట్టాలలో ఒకే పద్యం తిరిగి మఱోచోట ఉదహరింపబడుతుంది! అప్పుడు అవి emphasize అన్న పదానికి చక్కని ఉదాహరణం అవుతుంది. మఱి అలా "భరతఖండంబు" పద్యం భానుమూర్తి గారిదిగా – వీరు భావిస్తున్న 1907 నాటి భారత ధర్మ దర్శనంలో గాక – అంతకు పూర్వం ముద్రింపబడిన ఏ పుస్తకంలోనూ ప్రస్తావింపబడి లేదే? ఉన్నట్లు శ్రీ సుబ్బారావుగారు చూపలేకపోయారే! మఱిప్పుడు ఆ నిర్వచనానికి "భరతఖండంబు" పద్యం ఎలా సరిపోతుంది! అయినా ఏ కవి అయినా తను వ్రాసిన పద్యానికి తానే కొటేషన్లు ఎందుకు పెట్టుకుంటాడు – అన్న స్వల్ప విషయంపై శ్రీ సుబ్బారావుగారు, వారి 'సెబాస్ సెబాస్ కారులు కాని ఎందుకు దృష్టి పెట్టలేదో?? అది వేఱొకటి పద్యం గనుకనే శ్రీ భానుమూర్తిగారు కొటేషన్లు పెట్టారు అనే నా వాదనకు సమర్థనగా కొటేషన్లకు ఈ క్రింది నిర్వచనాన్ని గమనించండి.

J.B. HEATON & J.P. STOCKS లు రచించిన "OVERSEAS STUDENTS COMPANIAN TO ENGLISH STUDIES...." అనే ఆంగ్ల వ్యాకరణ గ్రంథంలో

The Qutation marks are used

1. for lifting words, passages and speaches also.

2. for deriving matter from the direct sources as reference

(Qutation marks are not used in such cases as mentioned above particularly, tantamount of plagiarism)

(కొటేషన్లు పెట్టకపోతే గ్రంథ (పద్య) చౌర్యంతో సమానమట)

అది తనది కాదని, ఎఱవు తెచ్చుకొన్నది అని తెల్పటానికి 1907 నాడు అంటే భానుమూర్తి గారి నాటికి కొటేషన్లు పెడితే చాలు – ఎక్కడ నుండి ఎఱవు తెచ్చుకొన్నారో చెప్పాల్సిన దానికన్నా – ఆ పద్యం మాకు స్ఫూర్తి అని చెప్పుటకు కొటేషన్లు పెడితే చాలు గదా!

శ్రీ సుబ్బారావుగారు 'మనోరమ' పత్రికలో పాల్‌సభల, మఱియు పద్యం ప్రస్తావన లేదని వ్రాశారు. పద్యం ప్రస్తావన లేకపోలేదు. "నవంబర్ & డిసెంబర్ 1907" నాటి మనోరమ మాసపత్రికలో "భారత ధర్మ దర్శనం" పుస్తకం యొక్క సమీక్ష ప్రచురింపబడింది. ఇందులో కూడా "భరతఖండంబు" పద్యం కొటేషన్లలో చూపబడింది. ఇక్కడ కూడా J.B. HEATON గారి నిర్వచనం అనుసరింపబడింది. ఇక పాల్ సభల ప్రస్తావనమంటారా? అది రాజకీయ పత్రిక కాదు. సాహిత్య పత్రిక కదా! అందువలన అందు రాజకీయాలకు చోటులేదు కదా! ఈ విషయాన్ని రంగనాయకమ్మగారు బాక్సు కట్టి మఱీ చూపారు.

1907 నాటి "భారత ధర్మ దర్శనం" పుస్తక ముద్రణలో శ్రీ భానుమూర్తి గారి పేరుండకపోవటానికి అప్పటికి లేని శ్రీ భానుమూర్తి గారి ప్రభుత్వ ఉద్యోగాన్ని సాకుగా శ్రీ సుబ్బారావుగారు తదితరులు చూపారు! 1910లో శ్రీ భానుమూర్తిగారు ప్రభుత్వ ఉద్యోగంలో చేరారు! మఱి 1907లో ఆయన పేరు ముద్రింపబడక పోవడానికి – రాబోయే ఆ ఉద్యోగం ఎలా కారణం అయిందో సుబ్బారావుగారు చెప్పలేదు. ఈ సందర్భంలో దేశద్రోహకర పద్యాలు ప్రచురించిన ప్రచురణ కర్తను, సంస్థను ప్రభుత్వం అరెస్టు చేయదా మఱి? సంస్థకు, కర్తకు అది నేరం కాదా?" అని రంగనాయకమ్మగారు వేసిన ప్రశ్నకు సుబ్బారావుగారు సమాధానమీయలేదు.

ఇక మధునాపంతుల వారు 1968లో హైదరాబాద్‌లో జరిగిన ఒక సభలో చిలకమర్తి వారిని గూర్చి ప్రసంగిస్తూ "భరతఖండంబు" పద్యం ఊసే ఎత్తలేదని – దానిని కారణంగా మధునాపంతుల వారే సందేహించారని శ్రీ సుబ్బారావు గారు



వ్రాశారు! దానికి కారణం 1959లో శ్రీ పోతుకూచి వారి గ్రంథం కారణం అన్నారు. పోతుకూచివారి అత్యుత్సాహం ఎన్ని అనర్థాలకు దారి తీస్తున్నదో కదా? మఱిచా! శ్రీ ఎన్.వి.ఎస్. ప్రసాద్‌గారు కూడా శ్రీ పోతుకూచి వారి గ్రంథాన్నే ఆధారంగా చూపారు! కాని 1950లోనే శ్రీ మధునాపంతుల వారు తమ "ఆంధ్ర రచయితలు" గ్రంథంలో "భరతఖండంబు" పద్యం చిలకమర్తి గారిదని స్పష్టంగా వ్రాశారన్న విషయాన్ని శ్రీ శర్మగారు తమ సమాధానంలో ఉదహరించారు! అయినా శ్రీ పోతుకూచి వారి సంకలన గ్రంథం చూచి శ్రీ మధునాపంతుల వారు సందేహంలో పడ్డారని శ్రీ సుబ్బారావుగారు వ్రాతపూర్వక ఆధారాలు లేని ఒక ఊహనొక దానిని చేశారు! మరి అలాంటప్పుడు 1968లోని తమ ఉపన్యాసంలో శ్రీ మధునాపంతుల వారు ఈ పద్యం భానుమూర్తిగారిది అని కూడా చెప్పలేదు కదా! ప్రసంగ స్ఖాలిత్యాన్ని ఆధారంగా చేసుకొని లిఖితపూర్వకంగా వ్రాయబడిన దానిని నిరసిస్తామా? అదేనా పరిశోధనా పద్ధతి!

మఱొక ఉదాహరణాన్నిక్కడ ఇస్తాను. 30-11-1935 నాటి కృష్ణా పత్రికలో శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి "నాముక్క్యాల ప్రయాణం" అను వ్యాసంలోని ఈ క్రింది వాక్యాలను గమనించండి.

.... ఇది గాక నాకు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి ఎడల నిజమైన ప్రేమకలదు. నా సమకాలికులలో ఆయన కవిత్వమునందేమి, శ్రీదాసు శ్రీ రాములు గారి కవిత్వమునందేమి, శ్రీ ఆదిపూడి ప్రభాకరరావు గారి కవిత్వమందేమి, మఱికొందఱి కవిత్వమందేమి నాకెంతో అభిమానం.

తే.గీ. "భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి..."

ఈ వక్క పద్యంతో సమానమైన పద్యం నేను చెప్పగలనో లేదో అనుకుంటూ వుంటాను. ఆయన మతాన్ని నేను ప్రేమించేవాణ్ణిగాను. ఆయన కవిత్వాన్ని ప్రేమిస్తాను. ప్రేమించనే అనుకోండి – లోకం నిందించదా?....." అని వ్రాశారు.

ఇది "కథలు – గాథలు" అన్న శ్రీ చెళ్ళపిళ్ళ వారి గ్రంథం పేజీ 76, 77లలో ఉదహరింపబడింది. ఇప్పుడు చెప్పండి శ్రీ సుబ్బారావుగారూ – ఈ ఆధారం

కూడా విశ్వసనీయం కాదంటారా? ఇది 1935లో కృష్ణాపత్రికలో వచ్చింది. 1950లో "కథలు - గాథలు" లో ముద్రింపబడి ఉంది! ఈ ఆధారాలు విశ్వసనీయాలు కావా? ఆ తరువాత అంటే 1959లో వచ్చిన శ్రీ పోతుకూచి వారి సంకలన గ్రంథంలో ముద్రింపబడినది మాత్రమే విశ్వసనీయమా? 1907లో ముద్రింపబడిన కొటేషన్లు, 1907లో మనోరమలో ముద్రింపబడిన కొటేషన్లు విశ్వసనీయాలు కావా? కొటేషన్లు తొలగించిన శ్రీ పోతుకూచి వారి గ్రంథమే విశ్వసనీయమా? 1907లో మనోరమలో "ఇది 1905 బెంగాలు విభజనకు ప్రేరితులై వ్రాయబడినవి" అని ఉదహరించబడకపోవడం విశ్వసనీయం కాదా? అత్యుత్సాహంతో 1959లో శ్రీ పోతుకూచి వారు ఆధారాలు లేకుండా "ఇవి 1905 బెంగాలు విభజనకు ప్రేరితులై వ్రాయబడినవి" అని ఉదహరించడం విశ్వసనీయమా? 1907 పాల్ సభకు ముందు ఎక్కడా ఏ పత్రికలోనూ భానుమూర్తి గారిదిగా ఈ పద్యం ప్రచురింపబడలేదనే సత్యం విశ్వసనీయం కాదా? భానుమూర్తిగారు వ్రాసి చిలకమర్తి గారికి చదివి వినిపించి ఉంటారు, దానిని ఈయన సభలో తనదిగా అప్పగించి - ఆ భానుమూర్తిగార్కి రావలసిన కీర్తిని ఈ చిలకమర్తి కొట్టేశాడు - ఇది మిత్రభేదం అనే ఊహ మాత్రమే విశ్వసనీయమా? ఈ ఊహకు ఎక్కడా లిఖిత ఆధారం వీళ్ళెవరూ చూపుటలేదు (ఊహగదా- అంతకు ముందు ఉండనిదిగదా - ఆధారాలు ఎక్కడ నుండి తెస్తారు?) అటువంటి మిత్రభేదానికే భానుమూర్తి గారు పాల్పడ్డారని నేను ఊహించకూడదా? ఊహకు అంతమే ముంటుంది - ఆధారమేమి ఉంటుంది? ఊహల మీద ఆధారపడి పరిశోధనలను చేస్తామా? చేయవచ్చు-, ఈలాంటి పరిశోధన పర్యవేక్షకుల అనుగ్రహం ఉంటే - పట్టాలు కూడా పొందవచ్చు!

చివరగా నాదొక మనవి! సత్యం శాశ్వతమైనది. చంద్రమతిత్వంతో నిండిన సుబుద్ధిని ఆశ్రయించిన సత్యం హరిశ్చంద్రాదులున్నంతకాలం నిత్యమై వెలుగొందుతుంది! ప్రపంచమంతటికీ ఆతడు లోహితాస్యుడే-, లేదా ప్రపంచమే అతనికి లోహితాస్యమౌతుంది. అసత్యానికి అపచారం చేయాలని తలంచిన వాడెప్పుడూ విశ్వామిత్రుడై అపకీర్తికి పాలుగాక తప్పదు. అట్టి వాని వందిమాగధులెల్లప్పుడు ఏ స్థాయిలో ఉన్నవారైనా స్వంత వ్యక్తిత్వాన్ని కోల్పోయి, స్వయం ప్రకాశం లేని వారై నక్షత్రకులుగా, తోకలుగానే పరిగణింపబడతారు.

**ఇది చరిత్ర చెప్పే సత్యం.**

# ప్రయోజనమ్ కిమ్?

## మహీధర రామశాస్త్రి

"భరత ఖండంబు చక్కని పాడియావు..."
ఈ పద్యాన్ని వ్రాసిందెవరు? - సత్యశోధన -
కరణం సుబ్బారావు

ఒక సాహిత్యాభిమానిగానే కాదు, చిలకమర్తి వారి అభిమానిగా కూడా ఈ పుస్తకాన్ని నేను చదివేను. ఊహించడానికి కూడా వీలు లేనట్టి పద్య చౌర్య నేరాన్ని చిలకమర్తి వారిపై మోపడంతో, నిజానికి చాలా బాధ కలిగింది. చిలకమర్తి వారి మూర్తిత్వంతో నాకున్న పరిచయం, వారిస్వీయ చరిత్ర ద్వారా, చెన్నాప్రగడ వారి మూర్తిత్వంతో నాకు లేదు. నాకే కాదు, చాలా మంది విషయంలో యిది యధార్థం. అటువంటి వారికి యిది నమ్మశక్యంగాని అభియోగమే. కాబట్టి అట్టి వారు ప్రతీకార్య చర్యకు పూనుకోవడం అసహజం యేమీ కాదు. అయినప్పటికీ 'ప్రమాదో ధీమతామపి' అనుకుంటూ నిష్పక్షపాతంగా ఈ పై పుస్తకాన్ని చదివేను.

ఒక అతిసామాన్య పాఠకునిగా నాకు కలిగిన అభిప్రాయాలను మీముందు ఉంచుతున్నాను.

'భరతఖండంబు..' పద్యాన్ని వ్రాసింది చెన్నాప్రగడ భానుమూర్తిగారేనని నిర్దుష్టంగ రూఢిగా నిరూపించలేకపోయేరు కరణం సుబ్బారావు గారని, నాకు అనిపించింది. కారణం, సుబ్బారావు గారు చూపుతున్న లేశమాత్రపు ఆధారం 'భారతధర్మధర్శనము' అను గ్రంథం. ఈ కావ్యాన్ని చెన్నా ప్రగడ భానుమూర్తి గారు వ్రాసేరని కరణం సుబ్బారావు గారంటారు.

'కానీ ఆ గ్రంథంలో మాత్రం ఎవరిపేరూ లేదు' అని ప్రా॥ జయధీర్ తిరుమలరావు గారు అంటున్నారు. అంతే కాదు వారే ఇలా కూడా అంటున్నారు. "కాని ఆ గీతం కర్తృత్వం ప్రశ్నార్థకమే అని ఆనాడూ భావించాను. ఈ నాటికీ భావిస్తున్నాను. మరిన్ని ఉటంకింపులు చూపితే తిరుగు ఉండదు. అది మరింత బలపడుతుంది." తిరుమలరావు గారే అంటారు - 'భారత ధర్మ దర్శనము' కావ్య పాత్య నిర్మాణాన్ని బట్టి చూసినా ఈ పద్యం చెన్నాప్రగడ వారిదేనని నాభావన'. 'ఆనాటి పొలిటికల్, హోంశాఖలో పైళ్లు కదిపితే ఇందుకు వత్తాసుగా మరికొంత సమాచారం లభిస్తుంది. ఆనాటి పత్రికలలో దాగిన సమాచారం కూడా అవసరమే.'

మెదటివీధి, శంభునగర్, రాజమహేంద్రి - 533 101.

అంటూ సూచిస్తూండడంవల్ల తిరుమలరావు గారు ఆత్మ రక్షణలో పడ్డారని నేను అర్థం చేసుకున్నాను. సుబ్బారావు గారి సత్యశోధన తిరుగులేని విధంగా లేదనీ, సమగ్రం కాదనీ తేల్చినట్లు నాకనిపించింది.

తర్వాత – డా॥ ఎస్.వి. సత్యనారాయణ గారంటారు – 'సభలో కూర్చుని నా మనసులో యూహించికుని' అనడంలో అది తన పద్యమైనా కావచ్చు, ఇతరుల దైనా కావచ్చునన్న ధ్వని ఉంది.'

నా వంటి సామాన్యులకు యిటువంటి మాటలద్వారా Benifit of doubt కలగడం సహజం!

"ఆశువు" – "ఊహించుకొని చదవడం" ఈ రెంటి మధ్యగా గల నిర్వచన భేదాలు పండితులచేత నిర్ణయించబడాల్సి ఉంది.

అదలా ఉండగా – డా॥ పూయ్యూరు లక్ష్మీనరసింహారావు గారు తీర్పు చెబుతూ, ఆయనంటారు – 'ఇంకా ఈ పద్యం చిలకమర్తి వారిదేనని భావించేవా రుంటే, వారు ముందుగా అందుకు ఆధారాలు చూపాలి. చూపలేని పక్షంలో సుబ్బారావు గారి కృషిని శిరసావహించాలి.'

ఆ మాటలో న్యాయం లేదనిపించింది. చిలకమర్తి వారి పద్యంగా సాహిత్యా భిమానల హృదయాల్లో తిష్ట వేసుకుని కూర్చున్న పద్యం అది. ఆ పద్యాన్ని ప్రజల హృదయాల్లోంచి పెటికి వేయబూనుకున్న వారిదే – నిర్దుష్టమయిన ఆధారాలు చూపాల్సిన బాధ్యత అవుతుంది! చిలకమర్తి వారి అభిమానులది కాదు! ఆ పద్యం చిలకమర్తి వారిదని వేరే నిరూపించాల్సిన అవసరం ఏముంది? It is already an established fact! చిలకమర్తి వారి వీరాభిమానులు వాదనకే దిగితే, సుబ్బారావు గారి ఆధారాలు పేలవమైనవనీ, చాలవనీ నిరూపించగలుగుతే చాలును. అయితే అది అంత సులువయిన పనికూడా కాదు! కొండను త్రవ్వడంలాంటి కష్టతరమైన పనిని చేపట్టిన కరణం సుబ్బారావు గారి శక్తి, సామర్థ్యాలను కూడా తక్కువగా అంచనా వెయ్యకూడదు! పైగా వారి వెనుక విభీషణ విజ్ఞులైన శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి గారూ, శ్రీ సన్నిధానం నరసింహ శర్మ గారూ వంటి వారు నిలబడి ఉన్నారన్న నిజాన్ని పెడ చెవిన పెట్టకూడదు!

ఇప్పుడు శ్రీ పి. శ్రీనివాస గౌడ్ గారు అన్నటువంటి మంచి మాటను గుర్తుకు తెచ్చుకుందాం. వారంటారు – 'శ్రీ కరణం సుబ్బారావు గారు మన ముందించిన వాస్తవాల్ని తెరచిన హృదయాలతో స్వీకరిద్దాం.. చర్చిద్దాం.. నిజాలను నిర్భయంగా నిర్ద్వంద్వంగా ఒప్పుకుందాం...'



చాలా మంచి మాట చెప్పేరు! కానీ 09-05-2009న రాజమండ్రిలో జరిగిన సత్యావిష్కరణ సభలో కొందరు చర్చకు ముందుకు వస్తే, అటువంటి అవకాశమే యివ్వకుండా,ఏకపక్షంగా సభను ఎందుకు ముగించాల్సి వచ్చిందో నా బోంట్లకు అర్థంగాని విషయం.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు 'చిలకమర్తి జీవితం – కార్యకలాపాలు' – గురించి చేసిన ప్రసంగాలలో 'భరతఖండంబు' ఊసు లేదన్నంత మాత్రాన అది చిలకమర్తి వారిది కాదన్న కారణం చేతనే వారలా చేసి ఉంటారని మనం అనుకోవడం ధర్మమా? (చూ... పే/1)

డా॥ సినారె పరిశోధనను తప్పుపట్ట గలిగిన సాహసంవున్న శ్రీ సుబ్బారావు గారు పరిశోధనా క్రమంలో సినారెను కలిసి చర్చించి ఉండాల్సింది, లేదా తన డ్రాఫ్ట ప్రతిని అందరికీ చూపించి అభిప్రాయాలను సేకరించినట్టుగానే, సినారేకి కూడా చూపించి, వారి అభిప్రాయాన్ని కూడా పుస్తకంలో చేర్చి ఉండాల్సింది అలా చేసి వుంటే కొంత సమగ్రత వచ్చి ఉండేది. అలాగే డా॥ ముక్తేవి భారతి గారి విషయంలో కూడా చేసి వుండాల్సింది! వెనుక అలా ప్రయత్నించిన ఘటనలు మనకున్నాయి. 'విషవృక్షం' వ్రాసిన రంగనాయకమ్మ గారు విశ్వనాథ వారి దగ్గరకు వెళ్లి ముందుమాట వ్రాయమని కోరేరట! విశ్వనాథ వారు వ్రాయలేదు. కానీ ఇప్పుడు సి.నా.రె. వ్రాసి వుండేవారేమో!

నాకున్న సందేహాన్ని యిక్కడే బయట పెట్టాలి. 'ఊహించుకుని చదివి తిని' అంటే పద్యచౌర్యం క్రింద జమ కట్టగలమా? ఆశువుగా పద్యాలు చదివే కవులు తమ మనసుల్లో ముందుగా ఊహించుకొని చదువుతారా, అల్లికగా మనసులోనే రచించుకుని చదువుతారా? ఆశుకవులు, అవధానులు నా ఈ సందేహం తీర్చగలరని ఆశిస్తాను. డా॥ భారతి గారు చెప్పిన దాన్ని 'కట్టుకథ' అని కొందరు అనుకోగలిగినప్పుడు, 09-05-2009 సభలో మలయవాసిని గారు యిచ్చిన సాక్ష్యాన్ని కూడా 'కట్టుకథ'గా మరికొందరు అనుకోవచ్చు గదా?

ఇంతకీ 'భారతధర్మదర్శనము' గ్రంథం మీద రచయితగా చెన్నాప్రగడ భానుమూర్తి గారి పేరు లేదెందుచేత? ఎక్కడో ఓ గ్రంథాలయంలో వున్న పుస్తకాల లిస్టులో వున్న భానుమూర్తి పేరు అధారమయింది. సత్యశోధన పనిని నెత్తికెత్తుకున్న సుబ్బారావు గారు 'భారతధర్మదర్శనం' గ్రంథం గురించి, ఆంధ్రదేశంలోని యే యితర గ్రంథాలయాన్నయినా తడిమారో లేదో తెలియదు.

'భరత ఖండంబు' – పద్యాన్ని ఒక అజ్ఞాత కవిదిగా చూపించిన తిరుమల రావుగారు – వీరేశలింగం, చిలకమర్తిల విగ్రహాల ప్రసక్తి తేవడం బాగుండ లేదు. హిందూ దేశంలో ఎవరి విగ్రహాలు వారికున్నాయి. ఒకరి విగ్రహాలను మరొకరు వేలెత్తి చూపించడం క్షేమకరం కాదు! "సమఝుదార్ఆద్మీ కో ఇసారా కాఫీహై" అంటే విజ్ఞులకు వివరించనవసరం లేదు. అందిస్తే అందుకోగలరు.

Whether any one likes it or not, We are very proud of వీరేశలింగం and చిలకమర్తి! There is not even an iota of doubt in it!

చివరిగా ఒకమాట చెప్పి ముగిస్తాను. లోకంలో రెండు సత్యాలు ఉండవచ్చు గాక. ఐనా జనాల నాలుకలమీద వున్న సత్యానికే చెల్లుబాటు. భూ భ్రమణమూ సత్యమే, సూర్య చంద్రోదయాస్తమయ భావాలూ' సత్యమే. ఉదయాస్తమయాలకే లోకంలో చెల్లుబాటు. ప్రజలు నాలుకలమీద నానే మాటలు అవే – అది అబద్ధమే అయినా సరే. అలాగే, 'భరత ఖండంబు...' పద్యం భానుమూర్తి గారిదని తేల్చగలిగినా, చిలకమర్తి వారి పద్యంగానే జన హృదయాలలో మిగిలి ఉంటుంది. 'దేశ భాషలందు తెలుగు లెస్స' అన్నమాట శ్రీకృష్ణదేవరాయలు వారిదిగా చెలామణిలో ఉన్నట్టు!

యూనివర్శిటీలు, ఎకాడమీలు ఎన్ని – తక్షణం మేల్కొని తమ కర్తవ్యాన్ని నెరవేర్చినా ప్రజా హృదయాలను ఎవరూ మార్చలేరనే నా నమ్మకం. 'రామాయణ విషవృక్షం' ప్రభావం ఎంత వుందో ఈ సత్యశోధన ప్రభావం కూడా అంతేనని నా విశ్వాసం. విశ్వనాథ వారి కీర్తిని ఇసుమంతయినా రంగనాయకమ్మ గారు తగ్గించ గలిగారా, రామాయణం పవిత్రత తగ్గిందా?

సాహిత్యానికి గానీ, చెన్నాప్రగడ వారికి గానీ ఈ సత్యశోధన కొత్తగా ఒరగ బెట్టేది యేమీ ఉండదు! చిలకమర్తి చిలకమర్తే; చెన్నాప్రగడ చెన్నాప్రగడే! వయో వృద్ధులకు జగద్గురువులు శంకరాచార్యులవారు యిచ్చిన హితవు ఈ సందర్భంలో గుర్తు కొస్తూంది. దాన్ని స్మరించుకుంటూ నా అభిప్రాయాన్ని ముగిస్తున్నాను.

భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితేకాలే
నహి నహి రక్షితి 'డుకృఞ్ కరణే'

---



# ఆ పద్యం చిలకమర్తిదే!

– సి.కె.ఎం.కుమార్

"భరతఖండంబు చక్కనిపాడియావు,
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ,
తెల్లవారను గడుసరి గొల్లవారు,
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి!"

నూట రెండేళ్లుగా తెలుగు సాహితీ సుక్షేత్రంలో సంచరిస్తున్న 'పాడియావు' ఈ పద్యం. మనభాషలో దేశభక్తి కవితకు ఆదిరచనగా ఆరతులందుకుంటోంది. గయోపాఖ్యానం, గణపతి, రామచంద్ర విజయం లాంటి రచనల ద్వారా సుప్రసిద్ధుడయిన 'ఆంధ్రా మిల్టన్' చిలకమర్తి లక్ష్మీనరసింహం – 1907లో – వేలాదిమంది సమక్షంలో చెప్పిన ఈ పద్యం తాలూకు కర్తృత్వం ఇటీవల వక్రీ'కరణ' పాలయింది. చిలకమర్తి ఈ పద్యం రాయలేదని ఆరోపిస్తూ, ఆయనేరాసినట్లు నిరూపించుకోవలసిన బాధ్యతను చిలకమర్తి నెత్తిమీదే వేసి తప్పుకున్నాడో పెద్దమనిషి. అతగాడి పేరు కరణం సుబ్బారావు. "భరతఖండంబు చక్కని పాడియావు...." ఈ పద్యాన్ని వ్రాసిందెవరు?" శీర్షికతో కరణం ఓ పుస్తకమే రాసేశారు. తాజాగా – సెప్టెంబరు ఏడోతేదీన – 'సూర్య' పత్రికలో ఆయన ఓ వ్యాసం సైతం రాశారు. చిలకమర్తి సత్యనిష్ఠను ప్రశ్నించడం – తన చిన్ననాటి చెలికాడు చెన్నాప్రగడ భానుమూర్తిపట్ల ఆయన స్నేహ ధర్మాన్ని శంకించడం– 'భరత ఖండంబు...' పద్యకర్తృత్వానికి సంబంధించి చిలకమర్తి స్వీయచరిత్ర ప్రామాణికం కాదని కుతర్కానికి దిగడానికిమించి ఇందులో కరణం కొత్తగా వినిపించిన వాదనలేమీ లేవు! వీటిని వాదనలనడం కన్నా నిరాధారమయిన నిందలనడం సబబు.

**అవసరమేమిటి?**

కందుకూరి వీరేశలింగం అడుగుజాడల్లో అనితరమయిన కృషిచేసిన చిలకమర్తికి లేనిపోని ఉద్దేశాలు అంటగట్టడం దౌర్భాగ్యకరం. తన, మన భేదంలేకుండా అవసరంలో ఉన్న వారందరినీ చేరదీసి ఆదరించిన ఈ ఉదారుడిపై

ఫ్లాట్ నెం. 56, ఫేజ్ 1, శారదానగర్, వనస్థలిపురం,
హైదరాబాద్ – 500 070.

అర్థంలేని అనుమానాలు రేకెత్తించాలని చూడడం విషాదకరం. గాంధీజీ హరిజనోద్ధరణ నినాదం చేపట్టకముందే, దళితులకోసం పాఠశాలను -సొంతఖర్చుపై- ప్రారంభించి, నడిపించిన వ్యక్తిపై బురదజల్లడం నీచం. రాష్ట్రమంతటా సాహితీ బంధుజనసందోహాన్ని సమకూర్చుకున్న మహారచయిత. తన చిరకాల మిత్రుడయిన మరోకవికి ద్రోహంచేశాడని బెత్తాయించడం దుర్మార్గం. తొలితరం పత్రికా రచయితల్లో ధ్రువతారగా వెలుగుతున్న చిలకమర్తి కీర్తికాయానికి ఆధారంలేని సందేహాలూ, చౌకబారు ఊహాగానాల తారు పులమాలని యత్నించడం హేయం. కానీ, కరణం సుబ్బారావులాంటి కొందరు పనిగట్టుకుని ఇదేపని పదేపదే చేస్తున్నారు. 'అభ్యుదయ' పీఠాధిపతులు కొందరీ కార్యకలాపాలకు చేయూతనందించడమే విడ్డూరం!

'భరతఖండంబు...' పద్యం రాసింది చిలకమర్తేనని చెప్పినవాళ్లు (డాక్టర్ సి.నారాయణరెడ్డి) చిచ్చు రగిల్చారనీ, దాన్ని బలపర్చినవారు (ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు) ఆ చిచ్చును ఊదారనీ, ప్రొఫెసర్ మామిడిపూడి వెంకటరంగయ్య, ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి, డాక్టర్ ముక్తేవి భారతి తదితరులు సదరు చిచ్చును వ్యాపింపచేశారనీ కరణం సుబ్బారావు చాలాకాలంగా తీవ్ర ఆరోపణలు చేస్తున్నారు. ఇంతకీ అంతటి చిచ్చును రేపి, ఊది, వ్యాపింపచెయ్యాల్సినంత అవసరం ఆ పెద్దలకేం ముంచుకొచ్చిందో కరణం ఎక్కడా చెప్పకపోవడం విడ్డూరం!

కోడిగుడ్డుమీద ఈకలు!

చిలకమర్తి మీద దాడి చెయ్యడానికి సహేతుకమయిన కారణం ఒక్కటికూడా చూపించలేకపోయారు కరణం. ఆకారణంగానయినా తను అనదల్చుకున్నది అనేయడానికే కరణం తెగించారు. ఈ అక్రమంలో ఆయన కోడిగుడ్డుమీద ఈకలు పీకడానికి తెగించారు. ఉదాహరణకు 'భరతఖండంబు...' పద్యం తను మనస్సులో 'ఊహించి' చదివానని చిలకమర్తి 'స్వీయచరిత్ర'లో రాశారట. బిపిన్ చంద్రపాల్ బహిరంగ సభలో చిలకమర్తి 'రాసి చదివిన పద్యమిది' అని సి.నా.రె. తన సిద్ధాంత గ్రంథంలో రాశారట. 'వీరు చెప్పిన 'భరతఖండంబు...' పద్యం అజరామమయినది' అన్నారట కొత్తపల్లి. చిలకమర్తి ఈ పద్యాన్ని 'అశువుగా చెప్పా'రన్నారట డాక్టర్



మద్దూరి. ఇవన్నీ ఏకరువు పెడుతూ, 'అసలు, పరిశోధకుల మధ్య ఈ వైవిధ్యం ఏమిటి?' అని నిలదీస్తున్నారు కరణం. పైన ఉటంకించిన మాటల్లో ఏమంత గొప్ప వైవిధ్యం ఉందో కరణంవారే సెలవివ్వాలి! ఆ వైవిధ్యమో, వైరుధ్యమో కరణం బుర్రలోనే ఉన్నట్లుంది.

అనేక కావ్యాలూ, కథలూ, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, పత్రికా సంపాదకీయాలూ రాసిన ఓ మహారచయిత, ఒక్క పద్యాన్ని ఇతరుల నుంచి – అదీ, బాల్య మిత్రుడినుంచి – దొంగిలించాడనడానికి కరణం సుబ్బారావుకు నోరెలా వచ్చిందో అర్థంకావడం లేదు! అంతకుమించి, చరిత్రలో స్థిరపడిఉన్న విషయాన్ని సవాలు చేసిన వారికే, తమ వాదాన్ని రుజువు చేసుకోవలసిన బాధ్యత ఉందన్న కనీస సంస్కారం కరణంలో కనిపించడంలేదు. ఈ సందర్భంగా ఒక్క విషయం చెప్పుకోక తప్పదు. సంచలనాల దాహానికి సత్యం బలికావడానికి వీల్లేదు. పెద్దలమీద రాళ్లు విసిరి పెద్దవాళ్లమయిపోదామనే కుట్రను సాగనివ్వకూడదు. సిద్ధాంత గ్రంథాలను పునర్మూల్యాంకనం చేస్తున్నట్లు నటిస్తూ, పరిశోధకులమీద నిరాధారంగా నిందలు మోపే దుస్సాహసాన్ని ఎంతమాత్రం సహించకూడదు 'సాక్షి' పాఠకులకూ, సాహిత్యలోకానికీ – చిలకమర్తి కుటుంబ సభ్యుడిగా – నా మనవి ఇది!

*('సాక్షి'లో ప్రచురితం)*

# చక్కని పాడియావుపై రంగనాయకమ్మ గారి తీర్పు

('భరతఖండంబు' పద్యంపై కువిమర్శకులు అనవసర సిద్ధాంత రాద్ధాంతాలు లేవనెత్తి చిలకమర్తిపై అభాండాలు వేయడానికి పూనుకున్నారు. చరిత్ర తెలిసిన వారు ఊరుకోలేరు కదా! అందుకే ప్రముఖ రచయిత్రి ముప్పాళ్ళ రంగనాయక్మ గారు ఈ "...చక్కని పాడియావు" ఎవరిది? అనే శీర్షికలో 56 పేజీల పుస్తకాన్ని ప్రచురించి తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. వారికి ధన్యవాదాలు. ఈ పుస్తకముపై సమీక్ష మాత్రం ఇక్కడ ప్రచురిస్తున్నాం)

ఇటీవల చిలకమర్తి వారి భరతఖండంబు చక్కని పాడియావు పద్యం ఎవరిది అనే అంశంపై వాదోపవాదాలు, పుస్తకాల ప్రచురణలు, సభలు, సమావేశాలు జరగడం సాహితీ పిపాసువులు చాలామందికి తెలుసు. ఈ నేపథ్యంలో ప్రముఖ రచయిత్రి రంగనాయకమ్మగారు " ఈ చక్కని పాడియావు" ఎవరిది అనే పేరుతో 56 పేజీల పుస్తకాన్ని ప్రచురించారు. రంగనాయ కమ్మగారు వాదనలను నిశిత పరిశీలన చేసినట్లే కన్పిస్తుంది. దానిపై తన తీర్పు/అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు.

ఈ పుస్తకం చదువుతున్నంత సేపు నేను కోర్టు హాల్లో కూర్చుని వాదోపవాదాలు వింటున్న భావం కలిగింది. రెండు వర్గాలు ఒకటి భానుమూర్తీ యులు, రెండు చిలకమర్తీయులు. వాద ప్రతివాదనలు పరిశోధనాదృష్టిలో చూసిన రంగనాయకమ్మ గారు విషయపరంగా ఆరు ఘట్టాలుగా విభజించి పాఠకులకు సులభగ్రాహ్యం చేసారు. వారి వాదనలతో బాటుగా తన అభిప్రాయాన్ని కూడా వ్యక్తీకరించారు. నా దృష్టిలో ఈ వాదనలు విన్న తర్వాత జడ్జిమెంట్ ఇచ్చినట్లే. ఆ జడ్జిమెంట్ నచ్చకపోతే పై కోర్టుకి అప్పీలు చేసికొన్నట్లుగా మరొక పుస్తకం వేసుకోవచ్చు. అది వేరే విషయం. కాని రంగనాయకమ్మగారు వ్యక్తీకరించిన అభిప్రాయాలలో చాలామంది ఏకీభవిస్తారనుకుంటున్నాను. తన అభిప్రాయాలను ఘట్టాలుగా విభజించారని చెప్పాను కదా!

---

రంగనాయకమ్మ, 76, లేక్‌సైడ్ కాలనీ (దుర్గంచెరువు దగ్గర),
జూబ్లిహిల్స్ పోస్టు, హైదరాబాద్ - 500 033.



**మొదటి ఘట్టం :** 1907 ఏప్రిల్ 19-24 తేదీలలో బిపిన్ చంద్రపాల్‌గారు రాజమండ్రి సభలలో బెంగాల్ విభజనపై ఆంగ్లోపన్యాసాలిచ్చినట్లు తెలుస్తుంది. ఆ ప్రసంగాలను చిలకమర్తి వారు అనువాదం చేసినట్లు చిలకమర్తి వారి స్వీయచరిత్ర వలన తెలుస్తుంది. చిట్టచివరి సభలో భరతఖండంబు చక్కని పాడియావు అనే పద్యం చెప్పినట్లున్నది.

**రెండవఘట్టం :** రంగనాయకమ్మ గారు ఈ ఘట్టంలో ఇరు వర్గీయుల అభిప్రాయాలను వివరించారు. చిలకమర్తి వారు పద్యం చెప్పిన ఆరు నెలలకు భానుమూర్తిగారి నక్షత్రమాల వచ్చింది. అందులో మొదటి పద్యంగా భరతఖండంబు చక్కని పాడియావు కొటేషన్స్‌లో ఉన్నది. కొటేషన్స్‌లో ఉన్న కారణంగా ఆ పద్యం ఆయనది కాదని,చిలకమర్తి వారిదని చిలకమర్తీయుల అభిప్రాయం.

1905 సం.లోనే భానుమూర్తి గారు 'భరతఖండంబు' పద్యం రాసారని చిలకమర్తి వారు సభలో చదివారని భానుమూర్తీయుల వాదన. నా పద్యాన్ని నువ్వు చదవడమేమిటని భానుమూర్తి గారు చిలకమర్తి వార్ని ప్రశ్నించడం గాని,నా పద్యాన్ని నీ పుస్తకంలో ప్రచురించుకోవడమేమిటని చిలకమర్తి వారు భానుమూర్తిగార్ని ప్రశ్నించినట్లు ఎక్కడా దాఖలాలు లేవు. నాటి పండిత లోకంలో కూడా ఈ పద్యాన్ని గూర్చి వాదోపవాదనలు గాని చర్చోపచర్చల గాని చేసినట్లు కనబడదు. ఇరు వర్గీయుల వాదనల పరిశీలన సుమారు అయిదు పేజీలు నడిచింది.

**మూడవ ఘట్టం :** చిలకమర్తి వారు 1906 సం. నుంచి మనోరమ పత్రిక నడిపారు. అందులో భానుమూర్తిగారి 'ధర్మదర్శనం' పుస్తకాన్ని సమీక్ష చేసారు. పుస్తకం మీద కవిగారు పేరుగాని, సంవత్సరము గాని లేనట్లే. సమీక్షకుని పేరు గాని, ఊరు పేరు గాని లేదు. భరత ఖండంబు పద్యానికి కొటేషన్స్ అలాగే వుంచారు. సమీక్షజరిగినప్పుడయినా నాటి పండితులు ఏ ఒక్కరు చర్చించినట్లుగాని, ప్రశ్నించినట్లు గాని లేదు.

**నాలుగోఘట్టం :** 1944 సం.న ప్రచురించిన చిలకమర్తి వారు తన స్వీయచరిత్రలో .... గారి సభలో పద్యం చదివినట్లు చెప్పుకున్నారు. 1946 సం.లో

చిలకమర్తి వారు కీర్తిశేషులయ్యారు. 1947సం.లో భానుమూర్తిగారు కీర్తిశేషులయ్యారు. చిలకమర్తి వారి స్వీయచరిత్ర వచ్చిన తర్వాతనయినా భానుమూర్తిగారు అడగలేదు. బహుశా ఊహించుకుని అన్నారు కాబట్టి ఫరవాలేదనుకున్నారా? మరొక విషయం. నాటి పండితులలో చర్చలు లేవు. వివాదాలు లేవు. దీనికి సంబంధించిన సమాచారం నాటి పత్రికలలో లేదు.

**అయిదోఘట్టం :** ఈ ఘట్టం అంతా పోతుకూచి సూర్యనారాయణగారి మీదే నడిచింది. భానుమూర్తిగారి రచనలన్నీ కలిపి (కొన్ని వ్యాసాలు, కొన్ని నాటికలు, కొన్ని పద్యాలు కలిపి) భానుమూర్తిగారి కావ్య కుసుమాంజలి పేరుతో 1959లో ప్రచురించారు. అయితే నక్షత్రమాల శీర్షికలో ఉన్న 'భరతఖండంబు' పద్యానికి కొటేషన్స్ తీసేసారు. అంతే కాకుండా వరుస సంఖ్య వేసి 28 పద్యాలు చూపించారు. (ఆ వర్గీయులు అభిజిత్ కలిపి 28 అని చెప్పారనుకోండి) పోతుకూచి వారు 1905 సం.లోనిదని స్వంత ఊహతో వేసినట్లు తెలుస్తుంది. 1959 సం.రంలో భరతఖండంబు అన్నపద్యానికి కొటేషన్స్ ఎందుకు తీసేసారు. కావ్య కుసుమాంజలి 'సాహితీ కౌముది' అనే పత్రికకు పంపుతు పోతుకూచి వారు 'భరతఖండంబు' పద్యాన్ని భానుమూర్తిగారిదిగా సమీక్ష చేయనున్నట్లు తెలుస్తుంది. ఆ పత్రిక ఉప సంపాదకులు దానికి ఆధారాలు చూపమని పోతుకూచి వారిని అడిగినట్లు ఆధారాలు దొరక్క మాట్లాడలేక పోయారు. అప్పటి నుండి ఇప్పటి వరకు పోతుకూచి వారు మౌనంగానే ఉండిపోయారు.

**ఆరోఘట్టం :** పోతుకూచి వారి మాటలను బట్టి కరణం సుబ్బారావుగారు మరికాస్త ముందడుగు వేసి పద్యానికి భ్రష్టు పట్టించారు.

అక్కడితో ఘట్టాలు పూర్తయ్యాయి. చాలా విపులంగా పరిశీలనతో విషయాన్ని అందించారు రంగనాయకమ్మగారు. కనువిప్పు కలిగించారు భానుమూర్తీయులకు.

భానుమూర్తీయులు ఊహించుకొని అని చిలకమర్తి చెప్పడం చేత ఆ పద్యం ఆయనది కాదని వాదన. ఊహించుకుని అనే పదానికి గుర్తు చేసుకొని అని, తన పద్యాన్నే తను ఎందుకు గుర్తుకు తెచ్చుకోకూడదని రంగనాయకమ్మగారి సూచన. ఆశువుగా అన్నా,రచించి అన్నా, ఊహించి అన్నా అన్నీ ఒక్కటే. ఊహించకుండా



ఆశువుగా చెప్పలేరు. మొదట ఊహించుకుండా దేన్నీ రచించలేరు. ఒకే అర్థంలో ఉన్న మాటల్లోనించి ఎప్పుడూ ఒకేమట వాడుతూ వుంటారని అప్పటికి ఏది తోస్తే అది వాడతారు. ఈమాత్రం భానుమూర్తియులకు తట్టకపోవడం శోచనీయమన్నట్లు గానే రచయిత్రిగారి అభిప్రాయంగా తోస్తున్నది.

కరణం సుబ్బారావుగారు కొటేషన్స్ విషయంలో చాలా తప్పుగా ఆలోచించారని, ప్రాచీన కావ్యాలను ఉదాహరణలను చూపడం సరిగాదని అభిప్రాయపడ్డారు.

ఇంతవరకూ ఒక ఎత్తైతే కరణం సుబ్బారావుగార్ని వెనకేసుకుని వచ్చిన ముందు మాటలు రాసిన వారిపై రంగనాయకమ్మగారు దాడి చేయడం మరొకెత్తు. ఆచార్య జయధీర తిరుమలరావుగారు ధర్మాగ్రహం వెలుబుస్తూ ఆనాటి ఆర్కివ్స్ ఫైళ్ళు దొరికితే మరికొంత సమాచారం కూడా అవసరమే అని చెప్పడం హాస్యాస్పదమని రంగనాయకమ్మగారు వివరించారు. ఇది చాలా అవసరం కూడా, కారణం ఒకపక్క పద్యం భానుమూర్తిగారిదని సమర్థిస్తూ మరొకపక్క ఆదారాలు కోసం ఎదురుచూడ్డం మంచిది కాదు కదా!

జయధీర తిరుమలరావుగారి వింత తర్కాలు అనే శీర్షికలో రంగనాయకమ్మ గారు లేవనెత్తిన ప్రశ్నలనేకం. ఈ వాదోపవాదాలలో పాల్గొన్న / ఆసక్తి కలిగిన ప్రతి ఒక్కరూ చదవదగ్గవే. చేయి తిరిగిన రచయిత్రి కావడం చేత సుమారు పదకొండు పేజిలలో, సంభాషణా చతురత కనబరుస్తూ ఆసక్తి కలిగించారు. ఆలోచింపచేసారు. తిరుమలరావుగారి చివరలో వాడిన "ఏది ఏమైనా ఈ పద్యం చెన్నాప్రగడ వారిదే" అనడం రంగనాయకమ్మగారు తప్పు పట్టి, ఏది ఏమైనా అంటే పరిశోధనలన్నీ ఏది ఏమైనా అని సరిపెట్టుకుంటే పరిశోధన కొండెక్కినట్లే అని వ్యాఖ్యానించడంసబబే అనిపిస్తుంది.

సుబ్బారావుగారి వంది మాగధులు అనే పేరుతో ముందు మాటలు వ్రాసిన ప్రతి ఒక్కరి లోపాలను రంగనాయకమ్మగారు ఎండగట్టారు. వారిపై తన ప్రశ్నలను సంధించారు. రచయిత్రి అయిదు ప్రశ్నలు లేవనెత్తారు. ఆ ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలిగితే అందరికీ ఆమోదమే.

: ఆ ప్రశ్నలివి :

*1. భానుమూర్తిగారి రాత ప్రతిలో నక్షత్రమాల భాగం 1905లోనే తయారై వుంది. అని చూపించాలి. అసలు ఆధారంగా వుండగలిగేది ఇదే కాబట్టి.*

*2. పాత సభ నాటి నుంచీ ఆ పద్యం చిలకమర్తి గారిదిగా ప్రచారం అయిపోతూ ఉంటే 1944 దాకా భానుమూర్తి గారి స్పందన ఏమిటి?*

*3. చిలకమర్తి గారి స్వీయచరిత్ర 1944లో వచ్చాక భానుమూర్తిగారి స్పందన ఏమిటి?*

*4. నక్షత్రమాలలో, ఆ ఒక్క పద్యాన్నే తేడాగా నిలబెట్టిన గుర్తులకు కారణాలు ఏమిటి?*

*5. సూర్యనారాయణగారు కుసుమాంజలి సంపుటంలో నక్షత్రమాల కింద, 1905 కాలాన్ని పెట్టడానికి ఆధారం ఏమిటి?*

చివరలో రంగనాయకమ్మగారు సమీక్ష రూపంలో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ...." ...నా అభిప్రాయం భానుమూర్తీయులకు నచ్చదు. నేను ఇంకో అభిప్రాయానికి వచ్చి వుంటే అది చిలకమర్తీయులకు నచ్చదు.

ఎవరికీ నచ్చుతుందో, ఎవరికి నచ్చదో, అది అనవసరం కదా!

**- డా. అరిపిరాల**

(సమాచారమ్ లో ప్రచురితం)



# మేధావులు మెచ్చిన చిలకమర్తి

**- విరియాల లక్ష్మీపతి**

'భరత ఖండంబు చక్కని పాడియావు'అన్నపద్యం మీద దుమారం రేగుతోంది. అలనాడు అభ్యుదయ రచయితల సంఘంవారు చిలకమర్తివారిని ఘనంగా సత్కరించారు. తన స్వీయచరిత్రలో చిలకమర్తివారు ఆ సత్కారం గురించి గొప్పగా చెప్పుకున్నారు.

"నా జీవితమంతయు నెట్టి యాశయములతోను యెట్టిస్వతంత్రేచ్ఛతోనూ గడిపితినో యట్టి యాశయములు గలిగిన యువకసంఘం వల్ల నీ కార్యం సాధింపబడి నా స్వీయ చరిత్ర మచ్చుపడినందులకు సంతసించుచున్నాను. ఈ సంఘం వారి యొక్క సహాయం లేని పక్షమున నా స్వీయ చరిత్ర మింతలో మచ్చుపడక యుండెడిది. కాబట్టి యీ సంఘ సభ్యులకును వారి కార్యదర్శిగారైన చదలవాడ పిచ్చయ్యగారికిని వారికి తోడు పడిన యింకననేక మహనీయులకును నేను కృతజ్ఞతా పూర్వకాశీర్వచనములు చేయుచున్నాను" అంటూ చిలకమర్తి అరసం సాహితీ సంఘానికి కృతజ్ఞతలు ఆశీర్వచనములు అందించారు. రచన చేసినందుకు గాను ముందుగానే అందచేయ బడిన 750/- చదలవాడ పిచ్చయ్యగారు తెచ్చియిచ్చారన్న సంగతి దాపరికం లేకుండా ప్రకటించిన సౌజన్య మూర్తి చిలకమర్తి.

సాధారణంగా ఎవరి కవిత్వమూ మెచ్చుకోనటువంటి వీరేశలింగం పంతులు గారే చిలకమర్తి రాసిన పద్యాలు మెచ్చుకున్నారని స్వీయచరిత్రలో తెలియజేశారు.

అధికారులకు లంచాలు ఇచ్చుకోవడం వల్ల, అర్థంలేని పన్నులు చెల్లించుకోవడం వల్ల, మునసబులకు కరణాలకు ముడుపులు చెల్లించడం వల్ల పంటపండించిన రైతుకి గడ్డిమాత్రమే మిగులుతోందని సేద్యం చేసి కావుల దశ దుర్భరంగా వుందని చెప్పిన చిలకమర్తి వారి పద్యం వీరేశలింగం పంతులు గార్నే కాదు మిగతాపెద్దల్ని కూడా ఆకర్షించిందన్న సత్యం స్వీయ చరిత్ర చదివిన అందరికీ అర్థం అవుతుంది. నగరంలో గల పెద్దలందరూ ఆ పద్యాల్ని మళ్లీ మళ్లీ చదివించుకున్నారని చిలకమర్తి స్వీయ చరిత్రలో వ్రాసుకున్నారు. చిలకమర్తి తండ్రిగారు ఆ పద్యాన్ని రైతులకు విన్పించేవారని కూడా స్వీయ చరిత్రలో తెలిపారు. ఆనాడు అలా మెచ్చుకున్న న్యాపతి సుబ్బారావుగారు ఆ పద్యాల్ని విజయనగరం

పంపి శ్రీగురజాడ అప్పారావు గారిచేత ఇంగ్లీషులోకి అనువదింపచేసిన సందర్భం కూడా స్వీయ చరిత్రలో స్పష్టంగానే దర్శనమిస్తుంది.

ఆ విధంగా చిలకమర్తి కందుకూరి గురజాడలు మెచ్చిన కవిగా మనం అర్థం చేసుకోవచ్చు.

బిపిన్ చంద్రపాల్ గారు విశాఖపట్టణం మీదుగా రాజమండ్రి వచ్చి యిన్నీసుపేటలో ఉపన్యసించారు. ఇంగ్లీషు వారు హిందూదేశాన్ని పాలించే పద్ధతుల్ని ఖండిస్తూ వారిచ్చిన ఉపన్యాసాన్ని చిలకమర్తి వారు తెలుగులోకి తర్జుమా చేశారు. "సభలు జనులతో క్రిక్కిరిసి యుండెను. జనులకోరిక ననుసరించి నేను పాలుగారి యుపన్యాసములను వారు చెప్పినప్పుడే మనస్సులో ధారణము చేసుకుని వారి ఉపన్యాసాంతమున నొకటియు మరవకుండా సభాసదులకు తెనుగులో విన్నవించెడివాడను. కట్టకడపటి దినమున సభలో కూర్చుండి నా మనస్సులో యూహించుకుని ఈ క్రింది పద్యమును బహిరంగముగ కట్టకడపట జదివితిని అంటూ 'భరతఖండంబు' పద్యాన్ని కూర్చుచేసిన వైనాన్ని దాన్ని జనులకు అక్కడికక్కడే విన్పించిన సందర్భాన్ని సవిస్తరంగా వివరించారు.

అంతేకాదు చిలకమర్తి వారు అలాంటి పద్యాన్నే ఇంగ్లీషు దొరల దాష్టీకాన్ని నిరసిస్తూ వ్రాసిన సందర్భాన్ని కూడా మనం ఇక్కడ జ్ఞాపకం చేసుకోవలసిన అవసరం వుంది.

1907 మే నెల 9వ తేదీన ఇంగ్లీషువారు, దేశభక్తుడు మహాపురుషుడు అయిన లాలా లజపతిరాయ్‌ని పట్టుకుని అరస్టు చేశారు. దేశమంతా లజపతిరాయ్‌ని బంధించిన కారణంగా నిరసన జ్వాలలు అలుముకున్నాయి. భారతీయులందరూ ఏక కంఠంగా ఇంగ్లీష్‌వారు చేసిన ఈ దుశ్చర్యను ఖండించారు. ఈ నేపథ్యంలో విశాఖపట్టణంలో ఒక సభ జరిగింది. చిలకమర్తి ఆ సభలో ఉపన్యసించి దొరల దాష్టీకం మీద మరొక పద్యం రచించి విన్పించారు.

భరత ఖండంబె యొక బందెఖాన
అందులో నున్న ఖయిదీలు హిందు జనులు
ఒక గదినుండి మార్చి వేరొక గదిని
బెట్టుటే గాక చెరయంచు వేరేగలదె.



అంటూ మొదటి పద్యానికి దీటయిన పద్యాన్ని వెలయించారు. ఆనాటి జనుల ఆదరాభిమానాలు చూరగొ న్నారు. నేడు నిందా రోపణ చేస్తున్న వారు ఈ రెండుపద్యాల్ని దగ్గరపెట్టుకుని పరిశీలించవలసినదే....

చిలకమర్తి సరస్వతి, మనోరమ, దేశమాత, వంటి పత్రికలకు సంపాదకత్వం వహించారు. సంపాదకులుగా రచనల విలువలు, రచయతల విలువలు గమనించ గలిగినవారు.

అలనాటి ఆ పత్రికల చందాదారులపై బ్రిటిష్ ప్రభుత్వం విధించిన ఆంక్షలను ఎదిరించినధీరుడు. మత సామరస్యం కోసం, వితంతు వివాహాలను ప్రోత్సహించడం కోసం ఎంతో శ్రమించినవారు. హరిజనుల కోసం విద్యా లయాలు నడిపిన సంఘ సంస్కర్త. ప్రజలలో దేశభక్తిని స్వరాజ్యకాంక్షను ప్రోదిచేసిన జాతీయవాది.

ఇన్ని ఉత్తమ లక్షణాలు గల కవి, పండితుడు, సంపాదకుడు, సంఘసంస్కర్త ఒక పద్యాన్ని కాపీకొట్టాడని చోరీ చేశాడని, ఆరోపించడం ఉత్తమ సంస్కారులకు తగనిపని.

చిలకమర్తి వారు రచించిన స్వీయచరిత్రను సంపూర్ణంగా చదివి వంటబటించుకున్నవారికి మాత్రమే వారి మనస్సు వ్యక్తిత్వం అంతరంగం బోధపడుతుంది. అలా అర్థం చేసుకున్న వారెవరూ ఇలాంటి సంకుచిత అభియోగాలు మోపడానికి సాహసించరు. వీరేశలింగం పంతులు గారి మానస పుత్రులు చిలకమర్తి.

(ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రచురితం)

# "కరణం" వారికి తొందరపాటు తగదు

డా॥ డి. యస్వీ. సుబ్రహ్మణ్యం

ఈమధ్య "భరతఖండంబు చక్కని పాడియావు..." పద్య రచనను గూర్చి తర్జనభర్జనలు సాగుతున్నాయి. పరిశోధనతో కొత్త విషయాలు వెలుగులోనికి తేవాలనే ప్రయత్నం మంచిదే. చిలకమర్తి, చెన్నాప్రగడలు ఇద్దరూ మహనీయులు – ఇది ఎవ్వరూ కాదనలేరు. ఈపద్యరచన గూర్చి, కరణం సుబ్బారావుగారి "గ్రంథం" గూర్చి నాలుగు మాటలు చెబుతాను. నా అభిప్రాయం తప్పు అని సహేతుకంగా చెబితే శిరసా వహించడానికి అభ్యంతరం లేనివాణ్ణి.

కరణం సుబ్బారావుగారు "భరతఖండంబు..." పద్యం చిలకమర్తి రచనకాదు, చెన్నాప్రగడ భానుమూర్తి గారిది అనిప్రతిపాదించే వరకూ – ఇది చిలకమర్తివారి పద్యంగానే ఆంధ్రసాహిత్య చరిత్ర లో చెలామణీ అవుతోంది. ప్రస్తుతానికి కరణం సుబ్బారావుగారిది ప్రతిపాదనావస్థలోనే ఉందికానీ విమర్శకులు పూర్తిగా అంగీకరించిన దాఖలాలు లేవు. ఇట్టి సందర్భంలో – ఆచార్య సి. నారాయణరెడ్డిగారి వంటి వారంతా అమార్గంలో ప్రయాణించడం సాధారణ విషయం.

కరణం వారు నారాయణరెడ్డి గారి అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ – "వీరు మూలం చూడకపోవడం దురదృష్టకరం. రెడ్డిగారు తేలికగా తీసికొన్నారు. అదైనా సరిగా చూశారా? సదరుపరిశోధకులే చెప్పారు" – అని నారాయణరెడ్డిగారంతటి వారిని తేలికగా చూడవచ్చా? ఈ విషయంలో ఆయన పొరపాటు పడి "ఉండ"వచ్చు – అంతమాత్రంచేత ఆయన్ని ప్రశ్నించే తీరు ఇదా? ఒకసారి ఆయనతో స్వయంగా మాట్లాడి సందేహనివృత్తి చేసికొని ఆపై ఏదైనా వ్రాస్తే బాగుండేది కదా!

అలాగే డా॥కొత్తపల్లి వీరభద్రరావు గారి అభిప్రాయాలను వ్యతిరేకిస్తూ – "ఒకదోషానికి సాక్ష్యమిచ్చారు. "ఈపెద్దమనిషి", ఈ పరిశోధకుడికి ధైర్యంచాల్లేదు"– ఇది సత్యశోధనకు కావలసిన విమర్శ అనిపించుకొంటుందా? మద్దూరి సుబ్బారెడ్డిగారు "చిలకమర్తికే జైకొట్టారు"– ఇలాంటి వాక్యాలు చూస్తే – విషయంతో విభేదించాలి కానీ వ్యక్తులతో విభేదం పనికిరాదు కదా! "ఇంత ఘోరం ప్రపంచంలో ఎక్కడైనా

డో.నెం. 23-11-11/1, ఎల్.బి. శాస్త్రి రోడ్, రాజమహేంద్రి – 533 105



ఉందా – అపచారం శాశ్వతంగా కొనసాగాల్సిందేనా" ఇది అంత ప్రపంచసమస్య అంటారా సుబ్బారావు గారూ!

కరణం వారి గ్రంథంఇంకా ముద్రింపకముందే ఆచార్య యశ్వీ సత్యనారాయణగారు ఈ విషయంపై ఒక వ్యాసం వ్రాశారు. గ్రంథం అచ్చుపడక ముందు వ్యాసం వ్రాయవచ్చా? ఆ వ్యాసంలో కూడా స్పష్టమైన విషయ ప్రతిపాదన లేదు. కరణం సుబ్బారావుగారి పేరు ప్రచారమైంది. అంతే ఈ గ్రంథానికి "ఒక ధర్మాగ్రహ పరిశోధన" పేరుతో పెద్దలు ఆచార్య జయధీర్ తిరుమల రావుగారు పీఠిక వ్రాశారు. భరతఖండం పద్యాన్ని గూర్చిన గ్రంథాన్ని సమీక్షిస్తూ వారు గురజాడ, వీరేశలింగాల ప్రసక్తి తీసికొని రావలసిన ఆవశ్యకత కనపడ్డం లేదు. వారిద్దరూ బ్రాహ్మణులు కావడం వారి తప్పా. వీరిద్దరినీ కులం పేరుతో చులకన చేయవచ్చా? యదార్థవిషయాలు సహేతుకంగా వెలుగులోకి తేవాలే తప్ప చౌకబారు విమర్శలు తిరుమలరావు గారి వంటివారికి తగదు. తెలుగు వారి ఆదికవి నన్నయకాదని తిరుమల రావుగారు వ్రాసినంత మాత్రాన కాకుండాపోతాడా? "సామ్రాజ్యవాదాన్ని ఖండించే ప్రగతిశీల అగ్రవర్ణాల రచయితలు కూడా ఆధునిక సాహిత్య ప్రక్రియలకి దేశీయ భూమిక ఒకటి, ఉంటుందనే స్పృహలేదు. ఆంగ్లేయ పాలకుల అభిమాన విగ్రహాలే" అంటూ వ్రాశారు. ఈ గ్రంథానికి ఈ మాటలకి సంబంధం ఏమిటి?

ఈ విషయమై కరణం సుబ్బారావుగారిని ఫోన్‌లో అడిగితే నేను ఒక ఉచ్చులో ఇరుక్కుపోయానండీ! ఇటువంటి అభిప్రాయాలు గల వ్యాసాలు కొన్నిటిని రెండవ ముద్రణలో పూర్తిగా తీసేస్తానని విచారంవ్యక్తం చేశారు. మరి ఇటువంటి వారు గ్రంథావిష్కరణ సభ ఆహ్వానపత్రాలలో 'సత్యాన్ని' గూర్చి అంత ఊదరగొట్టవచ్చా? "…..సాహిత్యచరిత్రలో దోషులుగా మిగలడానికి కూడా వాళ్లు సిగ్గుపడరు" అన్న జయధీర్ తిరుమల రావుగారి మాటలు వారికి కూడా వర్తిస్తాయా?

ఈచిన్న పుస్తకానికి ఇంతమంది ముందు మాట వ్రాయవలసిన అవసరం ఉందా? అంటే ఈ గ్రంథం ప్రచురించడానికి గ్రంథకర్తకి ధైర్యం చాలడంలేదన్నమాట. – అందుకే ముందు మాటలు వ్రాసినవారంతా కాస్త ఇంచుమించుగా కరణం సుబ్బారావు గారిని సమర్థించారే తప్ప, వారి వాదనకు బలంచేకూర్చిన అంశాలు ప్రతిపాదించినట్లుగా కనబడడం లేదు.

ఇక గ్రంధావిష్కరణ సభలో – విద్యా, వయోవృద్ధులు నడిచే గ్రంధాలయంగా ప్రసిద్ధిపొందిన పూజ్యులు శ్రీపోతుకూచి సూర్యనారాయణమూర్తిగారు ప్రసంగిస్తూ – చిలకమర్తిని తాను చూసినట్లు చెబుతూ అస్పష్ట విషయాలే ప్రస్తావించారు. ఈ గ్రంథంలోని జయధీర్ తిరుమలరావుగారి అభిప్రాయాలను గూర్చి వారేమీ ప్రస్తావించలేదు. ఇలాంటి విషయాలపై ఇటువంటి పెద్దలే స్పందించక తలవంచుకు కూర్చుంటే ఎలా?నిజానికి సంగతిదేముదెరుగు – ఈ వ్యాసం సంగతి పోతుకూచివారు ప్రస్తావించకపోవడం విచారకరం.

ఇక ఈ పద్యం విషయంలో ఒక క్రొత్త వాదం వినిపిస్తోంది. అది సమాజానికి అంత ఆరోగ్యకరమైనది కాదు. "తెల్లవారను గడుసరి **గొల్లవారు** – పితుకుచున్నారు మూతులు బిగియగట్టి" అన్నప్పుడు గొల్లవారిని తెల్లవారితో పోల్చడం సిగ్గుచేటని ఒక వర్గంవారు ఉద్యమిస్తారని వార్తలొస్తున్నాయి. ఆవుపాలు పితికే వారంతా గడుసరి గొల్లవారే – అతడేకులం వాడైనా కావచ్చు – అది దోపిడీ వ్యవస్థకి ప్రతీకగా అర్థం చేసికోవాలే తప్ప, దాన్ని ఒకకుల వాచకంగా తీసికొని తప్పుదారి పట్టించడం న్యాయం కాదనిపిస్తుంది.

ఇక అసలు విషయానికి వస్తే చిలకమర్తి వారు బిపిన్ చంద్రపాల్‌గారి సభలో చివరగా – మనసులో **"ఊహించుకొని"** అనే పదానికి అర్థమేమిటని ఫోన్‌లో అడిగితే స్పష్టంగా తెలీదని **కరణంవారు** సమాధానం చెప్పారు. క్రియాఫలం కర్తృగామి అయితేనే ధాతువు అను ప్రయుక్తమవుతుంది. అటువంటప్పుడు ఊహించుకొని – అంటే తనసొంతభావాన్ని ఊహించి పద్యంగా చెప్పినట్లు అర్థం. ఈమాటతోనే ఈ పద్యం తన స్వీయరచన అని చిలకమర్తి ప్రకటించినట్లే ఇంతరాద్ధాంత సిద్ధాంతాలు వస్తాయని తెలిస్తే ఇదినేనే వ్రాశాను మొత్తం అని స్పష్టంగా చెప్పుకొనే వాడేమోమరి.

భారతధర్మదర్శనం – చెన్నాప్రగడ భానుమూర్తిగారిదే సందేహంలేదు. ఆ గ్రంథంలో ఈ పద్యానికి 'కొటేషన్సు" పెట్టి ముద్రించడం వల్ల ఈపద్యం చెన్నాప్రగడ వారిది కాదని గుర్తించాలి. భానుమూర్తిగారికి చిలకమర్తిగారికి ఎటువంటి పొరపొచ్చాలూ లేవు ఆవిషయం స్పష్టంగా తెలుస్తున్నా – "చిలకమర్తివారు మిత్రభేదానికి పాల్పడి భానుమూర్తిగారి పట్ల అధర్మానికి ఒడిగట్టారు." వంటి మాటలు



ప్రయోగించవచ్చా? ఇక టంగుటూరి శ్రీరాములు గారి ప్రస్తావన – వీరి వ్యక్తిత్వం గూర్చి ప్రకాశంగారి జీవితచరిత్ర చదివితే తెలుస్తుంది. వీరి మాటలు ఎంత వరకూ పరిగణనలోనికి తీసికొనాలి!

ఇక చివరగా ఒకమాట కరణం సుబ్బారావుగారు నియోగి కనుక నియోగి అయిన భానుమూర్తిగారి పక్షం వహించారంటే ఎంత నిజం ఉంటుందో చిలకమర్తి మిత్రద్రోహం చేశారనడంలో అంతనిజం ఉంటుంది. విషయ ప్రధానమైన విమర్శ ఉండాలిగాని, ఒకవ్యక్తినో, ఒకకులాన్నో, ఒక సంఘాన్నో కాదనాలని పనిగట్టుకొని విమర్శలు చేయకూడదు. శ్రీమాన్ కరణం సుబ్బారావు గారు ఎంతో శ్రమపడ్డారు. కొంత ఉచ్చులో పడ్డారు. అలాకాక నారాయణరెడ్డిగారిని మరికొంత మంది పండితులను కలిసి అభిప్రాయాలు తెలిసికొని, ఆపై రచన చేయవలసింది. ఇటువంటి విషయాలలో తొందరపాటు తగదు. సంయమనం కావాలి.

*('సమాచారమ్'లో ప్రచురితం)*

**చిలకమర్తిదే 'భరతఖండంబు చక్కని పాడియావు..."అని**

1. శ్రీరాపాక కౌస్తుభము
(చిలకమర్తితో చదువుకున్న మిత్రుడు చిలకమర్తి షష్టిపూర్తి సందర్భంగా 1928 సం॥ "హిందూ సుందరి"లో వ్రాశారు)

2. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.
(తిరుపతి వేంకటకవులలో ఒకరైన వీరు తమ "కథలు - గాథలు" పుస్తకంలో ప్రకటించారు.)

3. శ్రీ విస్సా అప్పారావు
("భారతి" మాసపత్రిక 1947 జూలైలో వ్రాశారు)

4. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

5. డాక్టర్ ఇంటూరి వెంకటేశ్వరరావు

6. ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

7. మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
(ఆంధ్ర రచయితలు గ్రంథంలో)

8. ఆచార్య సి. నారాయణరెడ్డి.

9. ఆచార్య మొదలి నాగభూషణశర్మ

10. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి

ఆమోదించినవారు.